# పౌరాణిక నీతి కథలు


ఆంగ్లమూలం

**కీ.శే. కోలారు కృష్ణఅయ్యర్**

తెలుగుసేత

**రావినూతల శ్రీరాములు**



**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

**2019**

# POURANIKA NITHI KATHALU

*Telugu translation*
**Raavinuthala Sriramulu**

*English version*
**Kolaru Krishna Ayyar**

T.T.D. Religious Publications Series No. 1363


*First Edition : 2019*

*Copies :* 500

*Published by :*
**Sri ANIL KUMAR SINGHAL**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

***D.T.P:***
Publications Division,
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందుమాట

ప్రాచీన భారతదేశం అనేక కథలకు గాథలకు పుట్టినిల్లు. పూర్వకాలంలో **'కథాకథనం'** (Story Telling Art) 'కథ చెప్పే పద్ధతి' ఒక గొప్ప 'కళ'గా రాణించింది. గుర్తింపు పొందింది. ఈ కళనే **'కథాకథనశిల్పం'** అన్నారు విమర్శకులు. అంటే కథ చెప్పడంలోని సొగసు. ఒక్కొక్క కథను ఆ కథలో నిరూపితమైన రసభావాలను దృష్టిలో పెట్టుకొని, ఒక్కొక్క తీరులో శిల్ప మనోహరంగా చెప్పేవారు. విశ్వామిత్ర మహర్షి బాలరామునికి, లక్ష్మణునికి ఎన్నో అద్భుత పురాణగాథల్ని బాలకాండలో చెప్పినట్లు, మహర్షివాల్మీకి రామాయణంలో వ్రాశాడు. సామాన్యంగా బాల్యకాలంలో విన్న కథలు పెరిగి పెద్దయ్యాక కూడా జీవితంలో ఎప్పటికీ మరిచిపోము. పోలేము. అది హృదయంలో గాఢముద్ర వేస్తుంది. అందుకే, రాముడు లక్ష్మణునితో **'ఏమి కథ! ఏమి చెప్పుట! ఏమి సొగసు!'** అని మెచ్చుకుంటాడు రామాయణ కల్పవృక్షంలో. ఈ మూడు మాటలు కలిపితే అది **కథాకథనశిల్పం** అవుతుంది. వాల్మీకి ప్రియశిష్యులు లవకుశులు, వ్యాసుని శిష్యులు జైమిని, సుమంత, పైల, వైశంపాయనులు కథా కథన దక్షులు (Experts in story narrating Art).

కవికుల గురువు కాళిదాసు మేఘసందేశమనే కావ్యం వ్రాస్తూ, అందులో కథానాయకుడైన యక్షుడు తన విరహాన్ని, భార్యకు మేఘం ద్వారా సందేశం పంపుతాడు. ఆ సందర్భంలోని ఒక వాక్యం చూడండి **"ప్రాప్యావంతీ ఉదయనకథాకోవిద గ్రామవృద్ధాన్"** "ఏ గ్రామంలో కథ చెప్పడంలో నైపుణ్యంగల వృద్ధులు శ్రోతలకు రచ్చబండల దగ్గర చెట్ల క్రింద, వాసవదత్తా ఉదయనుల ప్రేమ గాథలు రసరమ్యంగా చెబుతుంటారో, అది అవంతీనగరమని తెలుసుకో! అని ఆనవాలు చెబుతాడు.

కథలంటే ఎవరికి ఇష్టం ఉండదు? రాజరాజనరేంద్రుడంతటి మహారాజే తన చంద్రవంశ పూర్వీకులైన మహాభారత వీరుల కథలు వినాలని కుతూహలపడుతూ, – "బహు భాషల, బహు విధముల, బహు జనముల

వలన" ఎన్నిసార్లు భారతకథా విన్నా, **"అక్కథయ వినగ నిష్టము మాకున్"** అంటాడు. ఎఱ్ఱాప్రెగ్గడ, తన సమకాలంలో, "గాసట బీసటే చదివి గాథలు తవ్వు తెనుంగు వారికిన్", 'వ్యాసముని ప్రణీత పరమార్థం' తెలిసేలాగా చేసిన బ్రహ్మ కల్పులు నన్నయ, తిక్కనలను ఎంతో ప్రశంసించాడు. తానూ అటువంటి బ్రహ్మ కల్పుడే!

ప్రస్తుత గ్రంథం తొలుత శ్రీకోలారు కృష్ణ అయ్యర్ గారు ఆంగ్లంలో వ్రాస్తూ ఆసక్తిని రేకెత్తించే కథల్ని మాత్రమే ఎంపిక చేశారు. రామాయణం నుండి కొన్ని కథలు, భారతం నుండి కొన్ని, భాగవతం నుండి కొన్ని, పురాణాల నుండి కొన్ని కథలనేగాక ఇరుగు పొరుగు భాషలైన తమిళ, కన్నడ, మలయాళ భాషాసాహిత్యాలలోని అద్భుత రస ప్రతిపాదకాలైన గాథల్ని ఏరి మనోజ్ఞంగా చెప్పడంలో కృతకృత్యులయ్యారు. ఈ కథల్ని శ్రీరావినూతల శ్రీరాములుగారు రసవత్తరమైన శైలిలో తెలుగులో అనువదించారు.

ఈ కథలు కేవలం ఉబుసుపోక కోసం చదవక ఈ కథలుగల మూలగ్రంథాలు చదవడానికి ఉత్తేజాన్ని ఉత్సాహాన్ని కల్గిస్తే ఈ గ్రంథ కర్తలకృషి ఫలవంతమైనట్లే భావిస్తాను. చిన్నపిల్లలనుండి పెద్దవారి వరకు ఈ కథలు కొన్ని కనువిప్పు కాగలవు.

*సదా శ్రీవారి సేవలో....*

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి.

# విషయసూచిక

# 1. సూరదాసు

సూరదాసు శ్రీకృష్ణభగవానుని భక్తుడు. ఆయన అంధుడు. ఒకసారి ఆయన యాత్రకై బయలుదేరి దారిలో ఒక నీరులేని బావిలో పడిపోయాడు. ఆయన దేవుణ్ణి ప్రార్థిస్తూ "ఓ భగవంతుడా! నేను అంధుణ్ణి. నేను ఈ బావి నుండి బయటపడలేకపోతున్నాను. నన్ను కాపాడు స్వామీ! నీవు ఒక్కడవే నన్ను రక్షించగలవు'' అని కోరాడు. ఆయన మొర ఆలకించి శ్రీకృష్ణభగవానుడు రాధాదేవి సమేతంగా అక్కడికి విచ్చేసి సూరదాసును రక్షించారు. వారి సంభాషణను గుర్తుపట్టి సూరదాసు వచ్చినవారు శ్రీకృష్ణభగవాన్, రాధాదేవిగా గుర్తించాడు. ఆయన ఇలా ప్రార్థించాడు "భగవాన్! నేను నీ కంఠస్వరాన్ని మాత్రం వినగల్గుచున్నాను. గుడ్డివాణ్ణి కనుక దర్శించలేకపోతున్నాను" శ్రీ కృష్ణుడు సూరదాసుతో ఒక చమత్కారం చేశాడు. "రాధా! అతని దగ్గరకు వెళ్లకు. అలా వెళితే నీపాదాలు పట్టేస్తాడు" అని కృష్ణుడు రాధను హెచ్చరించాడు.

రాధ తెలివిగా సూరదాసు వెనుకవైపుగా వెళ్ళి వీపును స్పృశించింది.

సూరదాసు ఆమెను గుర్తించి "ఓహో! నీవు నా వెనుకకు వచ్చావా తల్లీ అంటూ ఆమె పాదాలు పట్టేశాడు. రాధాదేవి అతని చేతుల నుండి విడివడి దూరంగా వెళ్లింది. కాని, సూరదాసు చేతిలో ఆమె కాలిఅందెలు ఉండిపోయాయి. రాధాదేవి సూరదాసుతో "శ్రీకృష్ణునికి చాల ఇష్టమైన నాకాలి అందెలు నాకు ఇచ్చేశేయి" అని అన్నది.

అందుకు సూరదాసు "నేను గుడ్డివాణ్ణి కదమ్మా! అందెలు నీవే నని నాకు తెలిసేదెట్లా? నేను చూడ గలిగితే అవి నీ వని నాకు తెలుస్తుంది. అందుకు నాకు చూపు ప్రసాదించమని శ్రీకృష్ణుని కోరు" అని అన్నాడు.

రాధాదేవి విన్నపంతో శ్రీకృష్ణుడు సూరదాసుకు "చూపు" కలిగించాడు.

ఆయన రాధా కృష్ణులను దర్శించగలందులకు మహాదానందం చెందాడు.

శ్రీకృష్ణునికి సూరదాసు పట్ల అనుగ్రహం కలిగింది. "నీ వేదయిన వరం కోరుకో ఇస్తా" అని శ్రీకృష్ణుడన్నాడు.

సూరదాసు వినమ్రతతో **"ఓ! మహానుభావా! నీ దివ్యమంగళ స్వరూపం చూచిన పిమ్మట నాకు ప్రపంచంలోని ఇతర వస్తువులేవీ చూడాలని లేదు. నన్ను తక్షణం అంధుణ్ణిగా చేసేయ్"** అని ప్రార్థించాడు.

శ్రీకృష్ణపరమాత్మ పట్ల సూరదాసు భక్తి అలాంటిది.

## 2. మహాదాత కర్ణుడు

ఒకసారి శ్రీకృష్ణుడు తన ప్రియశిష్యుడు అర్జునునితో మాట్లాడుతూ "నీవు విలువిద్యలో గొప్పవాడివి అయితే కావచ్చు కానీ, అడిగినది ఇవ్వడంలో కర్ణునికి సాటి మరెవ్వరులేరు" అన్నాడు.

అర్జునుడు చిన్నబుచ్చుకున్నాడు. గంభీర కంఠంతో "దానం చేయడంలో నేను కర్ణునికి తీసిపోను" అని బదులు చెప్పాడు.

శ్రీ కృష్ణుడు చిరునవ్వు చిందించాడు.

ఇంతలో దూరప్రదేశం నుండి ఒక బ్రాహ్మణుడు తమ వైపుగా రావడం కృష్ణార్జునులు చూచారు. ఆయన కృష్ణార్జునుల సమక్షంలోనికి వచ్చి అర్జునునితో "ఓ రాజా! నా భార్య కాలధర్మం చెందింది. ఆమె భౌతిక కాయానికి అంత్యక్రియలు చేయాలి. అందుకు కట్టెలు, గంధపు చెక్కలు కావలసి ఉన్నాయి. మీరేమైనా సాయంచేయగలరేమోనని అర్థిస్తున్నాను" అన్నాడు.

అర్జునుడు ఒక సేవకుణ్ణి పిలిచి బ్రాహ్మణుడు కోరినవి తెప్పించి పెట్టమన్నాడు.

కొంతసేపటికి వాడు ఉత్తచేతులతో తిరిగివచ్చి "ఓ రాజా! మీ రాజప్రసాదంలో గానీ, బజారులో కానీ, కట్టెలు, గంధపు చెక్కలు దొరకలేదు" అని చెప్పాడు. అర్జునుడు తన అశక్తతను బ్రాహ్మణునికి తెలిపాడు. సాయంకోసం తాను కర్ణుణ్ణి దర్శిస్తానని చెప్పి బ్రాహ్మణుడు అక్కడి నుండి వెళ్లిపోయాడు.

ఆయన కర్ణుని వద్దకు వెళ్లి తన భార్య భౌతిక కాయానికి అంత్యక్రియలు చేయటానికి కావలసిన కట్టెలు, గంధం చెక్కలు ఇప్పించమని ప్రార్థించాడు. కర్ణుడు తన సేవకుని పిలిచి బ్రాహ్మణుడు కోరిన వస్తువులు ఇప్పించి పంపమని ఆనతి ఇచ్చాడు. సేవకుడు కొంతసేపటికి తిరిగి వచ్చి కర్ణునితో "మహాప్రభూ! బ్రాహ్మణుడు కోరిన సరుకులు మన రాజప్రసాదంలోను, పట్టణంలోని దుకాణాలలోను లభించలేదు" అని విన్నవించాడు. బ్రాహ్మణుడు నిరాశతో వెనుతిరిగి పోవటానికి సిద్ధమవుతున్నాడు.

కర్ణుడు ఆయనతో "కొంచెం ఆగండి! నా దగ్గరకు వచ్చిన వారెవరు వట్టి చేతులతో పోవడం నాకు ఇష్టంలేదు. నా రాజభవన స్తంభాలు గంధపు వృక్షాలకొయ్యలతో తయారయినవే!" అంటూ సేవకుణ్ణి ఒక గొడ్డలి తీసుకరమ్మన్నాడు.

సేవకుడు గొడ్డలి తీసుకొని రాగానే "నా రాజభవన స్తంభాలను ఈ గొడ్డలితో చెక్కేసేయి. ఈ దానంతో అవి సద్వినియోగం అవుతాయి" అన్నాడు. సేవకుడు స్తంభాలను చెక్కుతుంటే రాజభవనం ఒకవైపు కూలిపోయింది. ఈ చెక్కిన గంధపు చెక్కలను ఈ బ్రాహ్మణునితో పాటు ఒక బండిలో పంపించు" అని కర్ణుడు తన సేవకుని ఆజ్ఞాపించాడు. నిండుగా గంధపు చెక్కలతో వున్న బండిని కృష్ణార్జునులు చూచారు.

కర్ణుడు తన రాజభవనంలోని స్తంభాలను చెక్కించి ఈ గంధపు చెక్కలను ఇప్పించినట్లుగా ఆ బ్రాహ్మణుడు కృష్ణార్జునులకు తెలిపాడు. శ్రీకృష్ణుడు

అర్జునునితో "దానం చేయడంలో కర్ణుడేమిన్న అని ఇపుడైనా అంగీకరిస్తావా" అని అన్నాడు.

అర్జునుడు తలవాల్చాడు.

## 3.భీముడు - హనుమంతుడు

పాండవులు, వనవాసం చేసే కాలంలో కొంతకాలం **"నారాయణాశ్రమం"** అనే ప్రదేశంలో నివసించేవారు. ఒకనాడు ఒక అపూర్వమైన "సహస్రదళ సుగంధిపుష్పం" ద్రౌపది నిలుచున్న ప్రాంతంలోనికి గాలికి కొట్టుకొని వచ్చింది. అది ఆహ్లాదకర సుగంధాన్ని వెదజల్లుతుండడం గమనించిన ద్రౌపది తన భర్త భీమసేనునితో "ఇలాంటి పుష్పాలు మరికొన్ని కావలెనని" కోరింది. భీమసేనుడు 'సరే'నంటూ అడవిలోనికి బయలుదేరాడు. సౌగంధికపుష్పాల కోసం వెదుకసాగాడు. అనేకరకాల పుష్పాలు వికసించే గంధమాదన పర్వతాలవైపు పయనమయినాడు. త్రోవలో ఒక కదంబవనంలో శ్రీరాముని వీరభక్తుడైన హనుమంతుడు రామనామం జపించుకుంటూ ఉన్నాడు. ఆయన భీమసేనుని అన్నగారే! తమ్ముణ్ణి దూరంనుండి చూచాడు.

హనుమంతుడు తన తోకను పెద్దదిచేసి భీముడు వస్తున్న దారికి అడ్డంగా పరిచాడు. "ఏ ప్రాణి శరీరభాగాన్ని ఐనా దాటుకుంటూ వెళ్లడం మంచి పద్ధతి కాదు" అని అనుకొన్న భీమసేనుడు అది మామూలు కోతి అని భావించి – కేకలు వేశాడు. "ఓ కోతీ! నీ తోకను నా దారినుండి తొలగించు" అని పలుకగా దానికి బదులుగా హనుమంతుడు "ఓ పెద్దాయనా! నేను చాల ముసలివాణ్ణి. పొడుగాటి బరువైన తోకను కదల్చలేకపోతున్నాను. నీవే దానిని దారినుండి తొలగించుకొని పో" అన్నాడు. భీముడు తోకను కదలించాలని ముందు ఒక చేతితో ప్రయత్నించాడు. ఫలితంలేదు. శక్తినంతా ఉపయోగించి రెండు చేతులతో ఒక పట్టుపట్టాడు. ప్రయోజనం కన్పించలేదు. అప్పుడు ఆయనకు ఆలోచన

కలిగింది "ఈ ముసలికోతి మారురూపంలో ఉన్న ఎవరో మహాత్ముడై ఉండాలి" అని భీముడు నమస్కరిస్తూ "ఓ! మహానుభావా! నీవు ఎవరో తెలియజెప్పు "నేను కుంతీదేవి పుత్రుడైన భీముణ్ణి యుధిష్ఠిరుని తమ్ముణ్ణి" అంటూ సాగిలిపడి మొక్కాడు. అప్పుడు ఆ ముసలికోతి "నేను హనుమంతుణ్ణి" అని ఆదరంతో చెప్పాడు "నీవు కోరుకుంటున్న పుష్పాలు గల సరస్సు ఇక్కడకు దగ్గరలోనే వుంది" తన తోకను దారిలో నుండి తప్పించాడు.

భీముడు హనుమంతుణ్ణి క్షమాపణకోరాడు. "వృద్ధుల పట్ల మర్యాదగా ఉండాలనీ, బలగర్వం పనికి రాదని" హనుమంతుడు ఆతనికి హితవు చెప్పాడు. "నీ ప్రయత్నం ఫలిస్తుందని" హనుమంతుడు భీముని ఆశీర్వదించాడు. తాను మరలా శ్రీరామజపంలో నిమగ్నమయినాడు.

భీమసేనుడు ఆ మార్గాన్నే దూరం వెళ్ళి సౌగంధిక పుష్పాలను సేకరించుకొని తన నివాసానికి వచ్చి వాటిని ద్రౌపదికి ఇవ్వగా ఆమె మిక్కిలి ఆనందించింది.

## 4. పూరీ గుడిలో విగ్రహం

కళింగదేశాన్ని పాలించే రాజు "జగన్నాథపురి"లో జగన్నాథ స్వామికి సుందరమైన ఆలయాన్ని నిర్మింప చేశాడు.

అందులో అత్యంత సుందరమైన జగన్నాథస్వామి విగ్రహం ప్రతిష్ఠించాలని సంకల్పించాడు. ఆయన దేశమంతటా ఈ విధంగా ప్రకటించాడు "రాజుగారు తాము నిర్మించిన దేవాలయంలో సుందరమైన జగన్నాథ స్వామి విగ్రహం ప్రతిష్ఠించాలని సంకల్పించారు. రాజుగారికి సంతృప్తి కలిగించే విధంగా విగ్రహం తయారుచేసిన శిల్పికి పదివేలబంగారు నాణాలు బహుమతిగా ఇస్తారు. కానీ! ఒక షరతు విగ్రహం రాజుగారికి సంతృప్తి కలిగించకపోతే శిల్పికి శిరచ్ఛేదనం జరుగుతుంది.

శిరచ్ఛేదనకు భయపడి శిల్పులు ఎవరూ ముందుకు రాలేదు.

చివరకు ఒక ముదుసలి శిల్పి రాజుసన్నిధికి వచ్చి ఇలా అన్నాడు "ఓ రాజా! నేను విగ్రహం చెక్కుతాను. కానీ ఒక షరతు".

రాజు వానిని ప్రశ్నించాడు "ఏమిటి ఆ షరతు?" శిల్పి "ఓ రాజా! విగ్రహం ముప్పది రోజులలోపూర్తి అవుతుంది. నేను పనిచేసే సమయంలో దేవాలయం మూసి ఉండాలి. ఎవ్వరూ – మీతోసహా – తలుపులను ఏ పరిస్థితులలోను తెరువరాదు" అన్నాడు.

రాజుగారు శిల్పిషరతును అంగీకరించాడు. ఆలయం తలుపులు మూసివేసి ముసలిశిల్పి పని ప్రారంభించాడు.

బయటవుండే జనాలకు ఉలి శబ్దాలు వినపడసాగాయి.

మంత్రిగారు రాజుగారితో మనవి చేశాడు. "ఓ! రాజా! ఆలయంలో ఉన్నది ఒకే ఒక ముసలిశిల్పి అయితే వేలమంది కూలీలు పనిచేస్తున్నట్లు శబ్దాలు విన్పిస్తున్నాయి. ఆతడు విగ్రహం చెక్కుతున్నాడా లేక ఆలయమొత్తాన్ని విధ్వంసం చేస్తున్నాడా? అని నాకు సందేహం కలుగుతున్నది" అన్నాడు.

రాజుగారిలా అన్నాడు "ఒక నెలదాకా తలుపులు తెరువబడరాదనే ఆతని షరతుకు నేను అంగీకరించాను. పది రోజులు మాత్రమే జరిగాయి. చూద్దాం" అన్నాడు. పది రోజులు తర్వాత తలలు పగిలే శబ్దాలు లోపలినుండి వినిపిస్తున్నాయి అని మంత్రిగారు రాజునుమరలా దర్శించి ఇలా అన్నారు. "ఓ రాజా! ఈ ముసలివాడు అసలు విగ్రహం చెక్కుతున్నాడా? అని నాకు అనుమానం కలుగుతూ ఉంది. ఒక వేళ ఇతడు మన విరోధులకు ప్రతినిధిగా శిల్పి వేషంలో దేవాలయ వినాశానికి వచ్చాడా? రాజు ముప్ఫై రోజులు వేచి చూద్దాం. నా మాట నేను నిల్పుకోవాలిగా" అన్నాడు.

ఒకనాడు రాజు స్వయంగా ఆలయ పరిసరాలకు విచ్చేసి లోపలనుండి వస్తున్న భీకరశబ్దాలను విన్నాడు. ఇంకా 30 రోజులు ఆగాలనిపించలేదు.

రాజు మరునాడు బలప్రయోగం చేసి తలుపులు తెరవబడాలని ఆదేశించారు.

కానీ! ఆశ్చర్యం! రాజు స్తంభించిపోయాడు. ముసలివాడు వికృతాకారమైన విగ్రహం చెక్కుతున్నాడు. రాజు కోపంతో ఊగిపోయాడు. శిల్పివైపు చప్పట్లుకొట్టి అరిచాడు "నీవు చెక్కుతున్న అందమైన విగ్రహం ఇదేనా?" ఓ రాజా! ముప్పది రోజులలో తలుపులు తెరవనని నీ శపథాన్ని భగ్నం చేశావు. మరికొన్ని రోజులు ఆగలేకపోయావా అన్నాడు. ముసలి శిల్పి.

దానికి రాజు ఇట్లన్నాడు "గుడిలో నుండి వెలువడుతున్న భయంకర శబ్దాలు కారణంగా మేము ఆలయంలోనికి ప్రవేశించాలనుకున్నాం. ముసలిశిల్పి ధైర్యంగా రాజుతో చెప్పాడు. "భగవానుడు అన్ని వస్తువులలో – అందంగాగానీ వికారంగాగానీ – ఉంటాడు అని నీకు బోధపరిచేందుకు నేను వికారమైన విగ్రహం చెక్కాను. ఈ విగ్రహాన్ని కూడా ఆలయంలో నిల్పండి" ఈ మాటలు పలికిన శిల్పి తన నిజస్వరూపాన్ని ప్రదర్శించాడు. ఆయన ఎవరోకాదు. సాక్షాత్తు జగన్నాథస్వామియే!

అయనే అందమయిన విగ్రహంగా మారి దేవాలయంలో నిలిచిపోయాడు.

## 5. ప్రేమతోనే భగవంతుడు తృప్తి చెందుతాడు

ఒకసారి దుర్వాసమహాముని దేవతల రాజధాని అమరావతికి వెళ్లాడు.

నగరం దేదీప్యమానంగా వెలిగిపోతున్నది. అక్కడే ఉన్న నారదమహర్షితో "ఇక్కడే ఏ ఉత్సవం జరుగబోతుంది?" అని ప్రశ్నించాడు.

"ఈ రోజు పూర్ణిమ. దేవేంద్రుడు దేవమాత అదితిని పూజిస్తున్నాడు అని చెప్పాడు నారదుడు.

అక్కడ జరుగుతున్న వైభవానికి దుర్వాసుడు ఆశ్చర్యపోయాడు. వందలకొద్దీ బంగారు పళ్యాలలో, బంగారు పుష్పాలు అర్చనలో వినియోగింప

బడుతున్నాయి. ఇదంతా దేవమాతకు దుర్వాసుడు స్వయంగా చెప్పదలిచాడు. ఆమె నివాసానికి వెళ్లాడు. ద్వారపాలకులు "అమ్మగారు అనారోగ్యంగా ఉన్నారు. మీరీ సమయంలో ఆమెను చూడటానికి వీలుపడదు" అని తెలిపారు.

ద్వారపాలకుల మాటలను లెక్కచేయక దుర్వాసుడు నేరుగా అమ్మవారు విశ్రమించిన ప్రదేశానికి వెళ్లాడు. ఆమె అనారోగ్యానికి కారణం "దేవేంద్రుడు తన సంపదను చాటుకుంటూ చేసే పూజచేత" అని తెలిసింది.

ఆయన విసిరిన ఒక్కొక్క బంగారుపూవు శరీరానికి తగిలి గాయాలైనాయి. అయితే అమ్మా! దీనికి పరిహారం ఎలా జరగాలి అని దుర్వాసుడు ప్రశ్నించాడు.

ఆమె "వారణాశిలో విశాలాక్షీ మందిరం చెంతవున్న ఒక మనిషి నా వ్యాధిని నివారించగలడు" అని అన్నది.

దుర్వాసుడు వెంటనే వారణాసికి బయలుదేరాడు. ఆ వ్యక్తిని చూడాలనుకున్నాడు. ఒక ఆలయంలో అమ్మవారిపాదాలచెంత కన్నీటితో ఒక ముదుసలి కన్పించాడు. దుర్వాసుడు వానితో "ఇక్కడెవరైనా వైద్యుడు ఉన్నాడా" అని అడిగాడు. అతడు ఏలాంటి సమాధానమివ్వలేదు. దుర్వాసుడు వారణాసిలో చాలచోట్ల వైద్యుణ్ణి గూర్చి విచారించాడు.

నిరాశతో ఆయన వెనుదిరిగి వచ్చాడు. ఈ సారి దివ్యజనని ఉత్సాహంతో నృత్యం చేస్తూ ఉండటం గమనించి ఆశ్చర్యపోయాడు. ఆమె ఆయనతో "నీకు వైద్యుడు కన్పించాడా" అని ప్రశ్నించింది.

"ఆలయంలో నాకు ఎవరూ తారసపడలేదు. ఒక వ్యక్తిమాత్రం విగ్రహంముందు కన్నీరు కారుస్తూ ఉండటం చూచాను'' అన్నాడు దుర్వాసుడు. దివ్యజనని దరహాసంతో దుర్వాసునితో "నీవు చూచిన ముసలివాడే నా వైద్యుడు. అతడు విడిచిన ప్రతి కన్నీటి బొట్టు నా శరీరాన్ని చల్లపరచి నా గాయాలను మాన్పించాయి" అన్నది.

వైభవోపేతంగా చేసే పూజలు దేవమాతకు ఆనందం కల్గించవు. ప్రేమతో, భక్తితో విడిచిన కన్నీటి బొట్లే ఆమెకు సంతృప్తినిస్తాయి" అని దుర్వాసుడు గ్రహించాడు.

## 6. జయ - విజయులు (వైకుంఠ ద్వారపాలకులు)

సనక, సనందన, సనాతన, సనత్కుమారులు. నలుగురూ బ్రహ్మమానస పుత్రులు. వారు ఎల్లకాలం బాలురుగానే ఐదేండ్ల వయస్సులో ఉంటారు. వారు ఎప్పుడు తలిస్తే అప్పుడు ఎక్కడికైనా వెళ్లే అవకాశం వుంది.

ఒకనాడు వారు వైకుంఠంలోని శ్రీమహావిష్ణువు దర్శనార్థం వెళ్లారు. మహావిష్ణువును దర్శించాలంటే వారు సప్తద్వారాలు దాటవలసివుంది. వారు ఆరుద్వారాలు దాటి ఏడవద్వారం దగ్గరకు వచ్చారు.

అక్కడ జయ, విజయులు ద్వారపాలకులు, వారు సోదర బృందంతో "మీరు సరి అయిన వస్త్రధారణ చేయనందున మిమ్ములను లోనికి అనుమతించమన్నారు. "మేము బ్రహ్మమానసపుత్రులం. శ్రీమహావిష్ణువు దర్శనార్థం వచ్చాం. మమ్మల్ని అడ్డగించకండి'' అన్నారు సనక సనందనాదులు.

జయుడు తీవ్ర స్వరంతో "మీరు పొగరుబోతు పిల్లలు. ఇక్కడ గొడవ చేస్తే మెడబట్టి గెంటాల్సి వస్తుంది" అని హెచ్చరించాడు.

బాలురు ఈ అవమానం తేలికగా తీసుకోలేదు. వారికి రోషం వచ్చింది. జయవిజయులతో "ఓరీ దురాత్ములారా! మీరీ పవిత్ర ప్రదేశంలో ఉండ దగినవారుకారు. భూలోకంలో రాక్షసులుగా జన్మించండి" అని శపించారు.

కాపలాదార్లు తమ తప్పు తెలుసుకున్నారు. తాపసుల పాదాలమీద పడి శరణువేడారు. ఇంతలో శ్రీమహావిష్ణువు, దేవేరి శ్రీదేవితో అక్కడకు విచ్చేశారు. బాలురు దివ్యదంపతులకు ప్రణమిల్లారు.

జయవిజయులు శ్రీమహావిష్ణువుతో "మహాప్రభో! మా తప్పులను మన్నించి మాకు శాప విమోచనం కలిగించండి" అని ప్రార్థించారు. తాపసులకు దయ కల్గింది. వారు జయ విజయులతో "మీరు శ్రీమహావిష్ణువు భక్తులుగా నూరు జన్మలు స్వీకరిస్తారా! లేక విరోధులుగా మూడు జన్మలు ఎత్తుతారా? అని ప్రశ్నించారు.

జయవిజయలు తాము దీర్ఘకాలం స్వామికి దూరంగా ఉండలేమని రాక్షస జన్మలే కోరుకున్నారు. ఆ విధంగా వారు మొదటి జన్మలో హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా, రెండవ జన్మలో రావణ, కుంభకర్ణులుగానూ మూడవ జన్మలో శిశుపాల, దంతవక్త్రులుగా, జన్మించి విష్ణుద్వేషులుగా తమ జీవితాలు గడిపారు. శ్రీమహావిష్ణువు వరుసగా నరసింహ, శ్రీరామ, శ్రీకృష్ణ అవతారాలు ధరించి రాక్షససంహారం చేశారు.

## 7. రాజుగారి కరుణ (లేక) భగవంతుని కరుణ

కన్నాపురి పట్టణంలో సుందరవరదన్ అనే రాజు పాలించేవాడు. అతడు అన్ని విధాల గొప్పవాడే కానీ భగవంతునిపై విశ్వాసం లేనివాడు.

ఒకనాటి రాత్రి రాజుగారు, మంత్రులు వెంటరాగా అజ్ఞాతంగా నగరంలో తిరుగసాగారు. దారిలో ఇద్దరు యాచకులు వారికి తారసపడ్డారు.

ఒకడు అమ్మా రాముని దయ! రాముని దయ! అంటూ భిక్షకోసం చేయిచాచాడు.

మరొకడు "అమ్మా రాజుగారి దయ! రాజుగారి దయ! అంటూ యాచన చేస్తున్నాడు.

మర్నాడు ఇరువురి యాచకులను రాజుగారు తమ సమక్షానికి పిలిపించుకున్నాడు.

రాజు వారిని ఇలా ప్రశ్నించాడు "మీలో ఒకరు రాముని పేరిట. మరొకరు రాజుగారి పేరిట యాచిస్తున్నా రెందుకు? భగవంతుని పేరుతో యాచిస్తున్న బిచ్చగాడు. "ఓ రాజా! ప్రపంచం యావత్తూ శ్రీరాముని దయవలనే రక్షింపబడుతున్నది. ఆయనే అందరికీ ఆరోగ్యం, ఐశ్వర్యం ప్రసాదించినాడు. అందుకని ఆయన పేరిట యాచిస్తున్నాను" అని జవాబు చెప్పాడు.

రెండవ యాచకుడు ఇలా చెప్పాడు. "ఓ ప్రభూ! భగవంతుడు మనకు కనుపించడు. రాజు కన్పించే దేవుడు. అందుకని ఆయన పేరిట యాచిస్తున్నాను" అన్నాడు.

రాజుగారు యాచకులను పంపివేశాడు. రాజుగారు మంత్రితో తన పేరిట యాచన చేస్తున్నవ్యక్తి రెండవవానికంటె తెలివైన వాడుగా ఉన్నాడు అన్నాడు.

మంత్రి ఇలా బదులు చెప్పాడు.

"మహారాజా! భగవదనుగ్రహం లేకపోతే చేసిన సాయంకూడా వానికి అందదు" అన్నాడు. రాజు "సరే చూద్దాం – రాజు గొప్పవాడో, దేవుడు గొప్పవాడో" – అన్నాడు.

మర్నాడు మంత్రితో రాజు దేశమంతటా ఇలా ప్రకటించమని ఆదేశించాడు. "వచ్చే శ్రీరామనవమినాడు రాజప్రాసాదానికి వచ్చిన వారందరికీ రాజుగారు బహుమతులు అందజేస్తారు.

ప్రకటన గూర్చి తెలిసికొన్న వేలాది జనం రాజప్రాసాదానికి వచ్చి కానుకలు అందుకున్నారు.

రాజుగారి దయ అంటూ యాచించిన బిచ్చగాడు వచ్చాడు. రాజుగారు ఆతనికి ఒక పెద్ద గుమ్మడికాయ బహుమతిగా ఇప్పించాడు."ఇది నీకు గొప్ప ఐశ్వర్యం కల్గిస్తుందనీ" అతనికి చెప్పాడు.

కొంత కాలం తరువాత రాజు మంత్రులతో నగర పర్యవేక్షణకు వెళ్లాడు.

గుమ్మడికాయ దానంపొందిన యాచకుడు ఇంకా అడుక్కుంటూనే ఉండడం గమనించాడు రాజు.

అతణ్ణి దగ్గరకు పిలిచి "నీకు గుమ్మడికాయ కానుక ఇచ్చాను గదా! ఇంకా అడుక్కుంటున్నా వేమిటి? అని ప్రశ్నించాడు.

యాచకుడు రాజుగారితో "ఓ రాజా! నేను రెండు వెండి నాణాలకోసం గుమ్మడి కాయను ఒకరికి అమ్మివేశాను. ఆ రెండు నాణేలు ఎంత కాలం వస్తాయి? అందుకని తిరిగి అడుక్కోనక తప్పటంలేదు.రాజువాణ్ణి మందలించి ఇలా అన్నాడు.

"ఓరీ మూర్ఖుడా! రత్నాలు, మాణిక్యాలు గుమ్మడి పండులో కూరి నీకు ఇచ్చాను. నీవు దానిని కోసికున్నట్లయితే గొప్ప ఐశ్వర్యవంతుడివి అయ్యే వాడివి."

రాజు తన భవనానికి తిరిగి వస్తుండగా రాజుకు, వారి పరివారానికి ఒక పల్లకీ కనిపించింది. భగవంతుని పేర యాచన చేసిన బిచ్చగాడు. అందులో కూర్చొని ఉన్నాడు. ఆత్మ సముఖానికి పిలిపించారు.

స్వల్పకాలంలోనే తానెట్లు ఐశ్వర్యవంతుడయినాడో తెలుపమని ఆతణ్ణి రాజు ప్రశ్నించాడు. ఆతడు ఇలా చెప్పసాగాడు.

ఓ రాజా! అదంతా శ్రీరామచంద్ర ప్రభుని కరుణ! నా తండ్రి ఆబ్ధికానికి ఒక బ్రాహ్మణునికి అన్నదానం చేయాల్సి వచ్చింది. ఒక యాచకుని నుండి గుమ్మడికాయ కొన్నాను. దానికి కోసేసరికి దాని నిండా బంగారు నాణేలు, రత్నాలు, ముత్యాలు చూచి ఆశ్చర్యపోయినాను. పెద్ద మొత్తానికి వాటిని అమ్మివేశాను. అప్పుడు రాజుగారికి బోధపడింది. "భగవదనుగ్రహంతోనే ప్రపంచంలో ఏ వ్యక్తి అయినా రాణించేదని"

## 8. కాశ్మీరు శాలువ

చొక్కలింగం విజయనగరం పాలించే ప్రభువు. ఒకనాడు తన పరివారంతో గణేశునిదేవాలయానికి వెళ్లి పార్వతీదేవిని పూజించి రాజు మందిరానికి తిరిగి వస్తున్నాడు.

త్రోవలో ఒక చెట్టు క్రింద తాయుమానవర్ అనే సాధువు ధ్యానం చేసుకొంటూ ఉండటం రాజుగారు చూచాడు, వాతావరణం – చలితీవ్రంగా వుంది. 'తాయుమానవర్' అనే పేరుకు "తల్లిగా కూడ అయినవాడు" అని అర్థం. (తాయుమ్+ఆనవర్= తల్లిగా కూడ అయినవాడు.)

సాధువు చలికి వణికిపోతున్నాడు. రాజు తన సేవకుణ్ణి ఒకణ్ణి పిలిచి సాధువు కోసం మంచి కాశ్మీరు శాలువ తీసికొని రమ్మనినాడు.

సేవకుడు చాలాఖరీదయిన కాశ్మీరు శాలువా తెచ్చాడు. దానిని రాజు సాధువుకు బహూకరించాడు. తర్వాత రాజు తన మందిరానికి వెళ్లిపోయాడు. ధ్యానం ముగియగానే సాధువు భిక్షకోసం పయనమయ్యాడు. త్రోవలో ఒక పేదబాలిక చలితో బాధపడటం గమనించాడు. ఆ బాలికను తన చెంతకు రమ్మనమని సాధువు పిలిచాడు. అక్కడి జనం "స్వామీజీ! ఆ బాలికను తాకకండి. ఆ పిల్ల అంటరానిది" అంటూ బాలికను తిట్టిపోశారు. స్వామీజీ వారి మాటలను లెక్క చేయక, బాలిక తన చెంతకు రాగానే ఆమెకు శాలువా కప్పి ఆమెకు మోకరిల్లి అక్కడి నుండి వెళ్లిపోయాడు.

వేగులవాడొకడు రాజుగారితో "ఓ రాజా! మీరు బహూకరించిన ఖరీదయిన కాశ్మీరు శాలువాను ఆ సాధువు ప్రజలంతా వద్దంటున్నా పెడచెవిని చెవిన బెట్టి అంటరాని బాలికకు ఇచ్చి వేశాడు" అని ఫిర్యాదు చేశాడు. రాజు తాను అవమానం పాలయినట్లు భావించి "నేను ఎంతో గౌరవంతో శాలువను అతనికి బహూకరిస్తే బజారులోని అంటరాని బాలికకు

దానిని ఇవ్వడానికి ఆ సాధువుకు ఎంత ధైర్యం! తక్షణం సాధువును రాజసభకు పిలిపించి సంజాయిషీ తీసుకోండి" అని హుకుం జారీ చేశాడు.

సాధువు రాజసభకు రాగానే రాజు అతణ్ణి ఇలా ప్రశ్నించాడు. "క్షమించండి! అత్యంత గౌరవంతో నేను బహూకరించిన శాలువాను మీరు అంటరాని బాలికకు ఇచ్చి నన్ను అవమానించిన కారణం తెలిసికోవచ్చా? సాధువు చెప్పసాగాడు.

"ఓ రాజా! భగవంతుడు. దివ్యజనని ప్రతివ్యక్తి హృదయంలో ఉంటారు. ఆ బాలిక మరెవరోకాదు. నన్ను పరీక్షించవచ్చిన జగన్మాత. అంతే గాదు, అవసరమయినవారికి చేసిన సాయం, భగవంతునికి చేసిన సేవతో సమానం. ఆ కారణంగా నేను ఆ శాలువాను బాలికకు ఇచ్చాను.

నీ బహుమతి జగజ్జనని చెంతకు చేరింది. ధన్యత చెందినట్లు భావించు"

రాజూ రాణీ ఇరువురూ సాధువుకు సాగిలపడి "మా అజ్ఞానానికి క్షమించమని" వేడుకున్నారు.

## 9. భూరి దానం

నాగాపురమనే పట్టణంలో కమలమ్మ అనే వితంతవు ఉండేది ఆమెతోపాటు ఆమె కుమార్తె కన్నమ్మ ఉంటూ వచ్చింది.

ఒకసారి నాగపురంలో కరువు ప్రబలింది. ఆహారం దొరకడం కష్టమయింది. కమలమ్మ కటిక దరిద్రురాలు కన్నీటితో కుమార్తెను దగ్గరకు తీసుకొని" బిడ్డా! నేను చాల దురదృష్టవంతురాలను. నిన్ను పోషించలేక పోతున్నాను" అని వాపోయింది.

కుమార్తె తల్లిని కౌగిలించుకొని "అమ్మా! నేను నీ గురించి దిగులు పడుతున్నాను. కొద్ది రోజులుగా నీవు ఒక్క ముద్దకూడా నోట బెట్టలేదు. నేను బయటికి వెళ్లి ఎవరి నుండైనా ఆహారం దొరుకుతుందేమో చూచి

వస్తాను" అని చెప్పి కన్నమ్మ ఒక ఇంటికి వెళ్లి దీనంగా "అమ్మా! మేము చాలా దినాలుగా అన్నం తినలేదు. కొంచెం అన్నం పెట్టండి" అని వేడుకొంది.

ఆ ఇంటివారు "ముందే మాకందరికీ సరిపడా ఆహార స్తోమతలేదు. మరొక చోటికిపో" అన్నారు. చాల ఇండ్ల నుండి ఇలాంటి జవాబే వచ్చింది. నిరాశతో వెనుదిరిగి పోతున్న కన్నమ్మకు త్రోవలో ఒక ముసలి అవ్వ, చెట్టుక్రింద రొట్టెలు కాలుస్తూ ఉండడం చూచింది. ఆమెతో "అమ్మా! ఆకలితో చచ్చిపోతున్నాం. ఒక్క రొట్టె దానం చేయమ్మా" అన్నది. ముసలి అవ్వ, కనికరంతో కన్నమ్మకు ఒక రొట్టె ఇచ్చింది. కన్నమ్మ మరలా అవ్వతో "అవ్వా! మా అమ్మ కూడా వారం రోజులుగా పస్తుగా ఉంది. ఇంకొక రొట్టె ముక్క దయదలిచి ఇస్తే నీకు చాలా రుణపడి ఉంటాను" అని వేడుకొంది.

ముసలి అవ్వకు జాలికలిగి రెండో రొట్టెను కూడా ఇచ్చింది.

తిరిగి ఇంటికిపోతున్న కన్నమ్మకు దారిలో ఒక కుక్క ఆహారం కోసం నకనకలాడటం చూచింది. ఆమె ఇలా ఆలోచించింది. "కుక్కలు తనలాగా ఆహారం కోసం అడుక్కో లేవు. మనుష్యులవైపు ఆత్రంగా చూస్తూ ఉంటాయి" అమె హృదయం కరిగి ఒక రొట్టెముక్క కుక్కముందు పడేసింది. కుక్కకు దానిని ఆబగా తిని తోక ఊపుకుంటూ వెళ్లిపోయింది.

కన్నమ్మ ఇంటికి రాగానే తల్లి "అమ్మా! ఏదైనా ఆహరం దొరికిందా" అని ప్రశ్నించింది.

జరిగినదంతా కన్నమ్మ చెప్పడంతో విన్న తల్లి మిక్కిలి ఆనందించింది.

"మనం మూగ జీవాలపట్ల దయ చూపాలికదా తల్లీ! అని ఏదీ రెండోరొట్టె మనం ఇద్దరం దానిని తిందాం" అని అడిగింది కమలమ్మ.

ఆ సమయంలోనే ఒక పేద బాలికవచ్చి ఆహారం కావాలంది. తల్లి తనవంతు రొట్టె ముక్కను ఆ పిల్లకు ఇచ్చి వేయమన్నది.

"చిన్నముక్కతో ఆ పిల్ల ఆకలి ఏమి తీరుతుంది! నా భాగం కూడా ఆ పిల్లకే ఇస్తాను అంటూ మొత్తం రొట్టెను ఇచ్చి వేసింది కన్నమ్మ తిండిలేక నీరసించిన తల్లీ కూతుళ్లు నిద్రలోకి జారుకున్నారు. జగజ్జనని కమలమ్మకు కలలో ప్రత్యక్షమై "నీవూ నీ బిడ్డా చాలదినాలు పస్తులుండి కూడా కుక్కకు, చిన్న పిల్లకు రొట్టె ముక్కలు దానం చేశారు. ఆ కుక్కగానూ, బాలికగానూ కన్పించింది. నేనే! మిమ్మల్ని పరీక్షించాలని అలా చేశాను. ఆపన్నుల పట్ల మీ జాలి ప్రశంసింప దగింది. మీ జీవితం ఉన్నంత కాలం పుష్కలంగా ఆయురారోగ్యాలతో సుఖంగా ఉండండి" అని ఆశీర్వదించింది. తల్లీ కూతుళ్లు నిద్రనుండి మేలుకొనే సరికి వారిల్లు భవంతిగా మార్పుచేసింది.

పుష్కలంగా వర్షాలు కురిసి కరువు అంతరించిపోయింది. ప్రజలంతా సుఖసంతోషాలతో జీవించసాగారు.

## 10. భక్త జనులకు సేవ

'ఇళయంగుడి' అనే గ్రామంలో మారన్ అనే గొప్ప శివభక్తుడుండేవాడు. అతని దగ్గరకు వచ్చిన భక్తులందరికీ ప్రతిరోజు సంతృప్తిగా అన్నదానం చేసేవాడు.

ఆతడు నిజమైన శివభక్తునికీ, ఆహారంకోసం నటించే శివభక్తునికి తేడా ఎంచే వాడుకాదు.

ఒకనాడు మారన్ ఇంట శివభక్తులమని చెప్పుకుంటూ "ఓం నమః శివాయ" జపిస్తూ పెద్దగుంపు వచ్చి చేరింది.

మారన్ అందరినీ స్నానం చేసి వచ్చి తన అతిధులుగా ఉండవలసిందిగా కోరాడు.

కాలక్రమంలో తన సంపాదనంతా అన్నదానానికి ఖర్చు చేసిన మారన్ పేదవాడుగా మిగిలాడు. తన సేవకులతో తానిక వారికి జీతాలు చెల్లించే స్థితిలో లేనని కాబట్టి తన వద్ద ఉద్యోగాలు చాలించాల్సిందిగా చెప్పాడు.

కానీ, అప్పులు చేసి అయినా శివభక్తులకు అన్నదానం చేయడం మారన్ మారలేదు. భార్య తాలూకు ఆభరణాలు, వంట పాత్రలు కూడా అమ్మి వేసి మట్టి పాత్రలతో వంట చేయించసాగాడు.

ఒకనాడు ధారాపాతంగా వర్షం కురుస్తున్నది. మహాశివుడు మారన్‌ను పరీక్షించ దలిచాడు. పూర్తిగా వాననీటిలో తడిసిపోయిన వ్యక్తి ఒకరు మారన్‌ను సమీపించి "నాకు చాలా ఆకలిగా వుంది. నేను పూర్తిగా తడిసినా మీ ఇంట అన్నం దొరుకుతుందని ఆశపడి వచ్చాను" అన్నాడు.

మారన్ అతిథిని సాదరంగా ఆహ్వానించాడు. కాని, ఇంటిలో ధాన్యపు గింజలేదని మారన్ భార్య భర్తను హెచ్చరించింది.

"ఫరవాలేదులే! ఈ రోజే పొలంలో విత్తనాలు నాటాను. వాటిని తిరిగి తీసికొనివస్తానంటూ" మారన్ పొలం వెళ్లి తిండిగింజలు తెచ్చాడు. కానీ వంట చేయడానికి వంట చెరకులేదు. వడ్లు దంచి బియ్యం తయారుచేయి. ఇంటి కప్పుమీద వున్న దుంగలు కొన్ని తీసివేస్తాను" అన్నాడు మారన్

మారన్ భార్య వంట చేసింది. మారన్ అతిథిని ఆహ్వానించడానికి బయటకు వెళ్లగా అతడు ఎక్కడా కన్పించలేదు. తన దారిద్ర్యాన్ని గమనించిన అతిథి వెళ్లిపోయివుంటాడని మారన్ భావించాడు.

అతిథి లేకుండా భోజనం చేయరాదని మారన్, అతని భార్య నిరాహారులై నిరీక్షిస్తూ ఉండిపోయారు. అకస్మాత్తుగా మహాశివుడు వారికి దర్శన మిచ్చి "మిమ్మల్ని పరీక్షించటానికి వచ్చింది నేనే! మీరు నా భక్తులపట్ల చూపుతున్న శ్రద్ధ మెచ్చతగింది. ఇకమీదట మీ ఇంటికి ఎందరు అతిథులు వచ్చినా సరిపడే ధాన్యం మీకు సమృద్ధిగా లభిస్తాయి" అని అభయం ఇచ్చాడు.

మారన్, ఆయన భార్య "ఓం నమః శివాయ" అంటూ మహాదేవునికి సాగిల పడ్డారు.

## 11. శింగారు రుషి

శ్రీరామచంద్ర ప్రభువు లంకాసురుడైన రావణాసురుని సంహరించి అయోధ్యకు తిరిగి వచ్చాడు. రామరావణ యుద్ధంలో వేలాది మంది రాక్షసులను సంహరించిన పాపపరిహారంగా ఒక బ్రాహ్మణునికి తిలలు దానం ఇవ్వాలని వశిష్ఠమహర్షి శ్రీరాముణ్ణి ఆదేశించాడు.

తిలాదానం గ్రహిస్తే పాపాలు తమకు అంటుకుంటాయని ఎవరూ ముందుకు రాలేదు. వశిష్ఠమహర్షి తిలాదాన గ్రహీతకు ఒక బంగారు దిమ్మె కూడా కానుక ఇవ్వగలమని ప్రకటింపకోరాడు.

సింగారుడనే రుషి అయోధ్యలో ఉండేవాడు. అతడు మిక్కిలి పేదవాడు. ఆ ప్రకటనను గూర్చి తెలిసికొన్న భార్య ఆయనతో "మీరీ దానాన్ని స్వీకరించండి. మీ ఆధ్యాత్మిక శక్తివలన దాన స్వీకరణ పాపఫలాలు మనకు అంటవు" అని హితవు చెప్పింది. కానీ, రుషి సింగారు, భార్య సలహాను అంగీకరించలేదు. "నేను ఆ దానం స్వీకరించి ఆధ్యాత్మిక శక్తి పోగొట్టు కోలేను. శ్రీరాముని పాపాలన్నీ నాకు అంటుకుంటాయి. చిన్న బంగారు దిమ్మెకోసం ఎంతో తపస్సు ద్వారాసాధించిన ఆధ్యాత్మికశక్తి కోల్పోవడం ఇష్టంలేదు, అన్నాడు.

ఆయన భార్య అంతటితో వదలలేదు. "దాన స్వీకార సమయంలో అనంతశక్తి అయిన పరమాత్మ వదనాన్ని దర్శించండి. అది మీ పాపాలను భస్మంచేస్తుంది" అని ఉపాయం చెప్పింది.

ఎట్టకేలకు రుషికి అంగీకరింపక తప్పలేదు. రాజమందిరానికి వెళుతూ త్రోవలో ఇలా ఆలోచించాడు. "శ్రీరామచంద్ర ప్రభువు వదనం చూచినందున నాకు సత్ఫలితంరాదు. ఏ పరిస్థితులలోనూ శ్రీరాములవారి పాపాలు పరిహారం కావటమే కోరతగినది.

అందుకని రామునికి తనకూ మధ్య దానం ఇచ్చే సమయంలో ఒక తెరపెట్టమని కోరాడు. అలాగే చేశారు. **దానం తీసికొని ఇంటికి వచ్చిన రుషి తన భార్యతో నేను దానం స్వీకరించే సమయంలో శ్రీరాముని వదనాన్ని చూడలేదు. ఆ కారణంగా నా ఆధ్యాత్మిక సంపద నశించింది"** అని చెప్పాడు.

రుషిపత్ని "ఓ ప్రియమైన పతిదేవా! విచారించకండి. పట్టాభిషేకంనాడు శ్రీరాముడు రథంపై నగరాన్ని చుట్టి వస్తాడు. ఆయన మన నివాసానికి దగ్గరకు రాగానే వెళ్లి దర్శనం చేసికొండి. ఆయన వదనం వీక్షించిన తక్షణం మీ సర్వపాపాలు పటాపంచలవుతాయి" అని సలహా ఇచ్చింది. పట్టాభిషేకం దినం రానే వచ్చింది. నగరం అంతా వైభవంగా వెలిగిపోతోంది. శ్రీరామ ప్రభువు రథం నగరం అంతా కలియ తిరుగుతూ రుషి శింగారుని కుటీర సమీపానికి వచ్చింది. శ్రీరామ ప్రభువు రథం దిగి వచ్చి" రుషిని ఇలా ఆశీర్వదించాడు.

ఓయి! శింగారూ! నీ ఆధ్యాత్మిక శక్తులు అంతరించాయనే విచారించే రోజులు గతించాయి. నీవు నీ ఆధ్యాత్మిక శక్తులన్నీ తిరిగి పొందావు" అంటూ అభయమిచ్చాడు.

## 12. శ్రీభానుదాసు

పండరీపురంలో భానుదాసు అనే వస్త్ర వ్యాపారి ఉండేవాడు. ఆయన మంచి భక్తుడు. నిజాయితీపరుడు. ఆయన అంగడికి ఎవరైనా రాగానే "అయ్యా! దీని వెలఅయిదు రాగి నాణెలు, నాకు కొంచెం లాభం ఇచ్చి దీనిని తీసికోండి"

"ఈ చీరనేత చాల పాతది. నేను తగ్గింపు ధరకు ఇస్తాను" అనేవాడు.

పట్టణంలోని ఇతర వ్యాపారస్థులకు ఆతణ్ణి గూర్చి గుర్రుగా ఉండేది. "అతడు నిజాయితీ కలవాడే! సత్య సంధుడే! అతడు సరకులను ఎక్కువ

లాభం లేకుండా తక్కువ ధరలకు అమ్ముతాడు. అది మాకు నష్టం కల్గిస్తున్నది. ఇలాంటి వ్యక్తి వ్యాపార రంగంలోకి రాకూడదు" అని తోటి వ్యాపారస్థులు అనుకునేవారు. పట్టణంలో వ్యాపారులంతా అతని దగ్గరకు వెళ్లి "నీవు ఈ విధంగా వ్యాపారం ఉదారంగా చేస్తుంటే మేమంతా దుకాణాలు మూసివేసుకోవాల్సి వస్తుంది. మా అంగళ్లకు ఎవ్వరు రావడంలేదు. నీ పద్ధతి మార్చుకో! లేదా అంగడి మూసివేయి" అని హెచ్చరించారు.

భానుదాసు సౌమ్యంగా ఇలా వారితో పలికాడు "అయ్యలారా! నన్ను క్షమించండి. జీవితంలో ధనం ఒక్కటే ప్రధానంగా ఉండరాదు. మనం నిజాయితీగా ఉండాలి. భగవంతుని ప్రార్థించాలి."

ఒక రోజు భానుదాసు దేవాలయంలోగల ఒక భజన కార్యక్రమంలో పాల్గొనాల్సి వచ్చింది. పొరుగువారితో తన అంగడిని చూస్తూ ఉండండని చెప్పాడు. అతడు అంగడి మూయనేలేదు.

ఇరుగువారు అతని మాటలను పట్టించుకోలేదు. తెరచిన అంగడి విషయం దేవుడే చూచుకొంటాడని ఆతని విశ్వాసం.

భానుదాసు అంగడిలో లేడనే విషయం తెలిసికొన్న వర్తకులంతా అందులోని బట్టలన్నీ సంగ్రహించి బావిలో పడవేసి వారి వారి అంగళ్లకు వెళ్లిపోయారు. ఆశ్చర్యంగా వారి అంగళ్లలో గల వస్త్రాలన్నిటినీ దొంగలు పూర్తిగా దోచేశారు. అడ్డంవచ్చిన వారిని చావ బాది వెళ్ళిపోయారు.

వర్తకులు తమ తప్పిదాన్ని గ్రహించారు. దేవుడు మనలను సరిగ్గానే శిక్షించాడు. **'మనం ఏదైతే విత్తామో దానినే కోసుకున్నాం'** అంటూ వాపోయారు. (జో/బోయేగా/సో/కాటేగా అని హిందిలో సామెత.) అందరూ కలసి భానుదాసు వద్దకు వెళ్లి తమ తప్పులను మన్నించాలంటూ పశ్చాత్తాపం ప్రకటించారు. అప్పుడు ఆయన ఇలా అన్నాడు.

"మీ చెడుప్రవర్తనకు పశ్చాత్తాపం ప్రకటించారు. పాండురంగ ప్రభువును ప్రార్థించండి. భగవంతుడు దయామయుడు తిరిగి మీరు వృద్ధిలోనికి వస్తారు. వ్యాపారం మళ్లీ ప్రారంభించండి" అన్నాడు.

## 13. శ్రీరామ భక్తురాలు శబరి

శబరి శ్రీరామచంద్రమూర్తి ప్రభువుకు అంకితమైన భక్తురాలు. ఆమె తండ్రి క్షత్రియుడు. తల్లి బోయ.

శబరి వివాహం తల పెట్టినప్పుడు తల్లిదండ్రులు వేలాది జంతువులను వధించి గొప్పవిందు చేయాలని సంకల్పించారు. శబరికి అది ఎంతమాత్రం ఇష్టంలేదు. తాను కన్యగానే ఉండిపోయి దైవప్రార్థనలో గడుపుతూ జీవించాలని నిర్ణయించుకున్నది. అలా అనుకొని తల్లి దండ్రులను వదలి మతంగమహర్షి ఆశ్రమానికి చేరింది. అక్కడ పవిత్ర జీవనం గడపసాగింది.

ఒకనాడామె మతంగ మహర్షిని ఇలా ప్రశ్నించింది "స్వామీ! స్వచ్ఛమైన జీవితం ఏమిటి? మతంగ మహర్షి ఇలా బదులు చెప్పాడు.

అమ్మాయీ! మానవజీవితగమ్యం దైవసాక్షాత్కారం. సత్సంగం, సత్పురుషుల, మహర్షులసేవ దైవసాక్షాత్కారానికి తోడ్పడతాయి. మనశ్శుద్ధి ధ్యానం చేయాలి".

మతంగి మహర్షి ఒక తక్కువ జాతి బాలికకు ఆశ్రయం ఇవ్వటం, ఆధ్యాత్మిక శిక్షణనివ్వటం ఆ ప్రాంత బ్రాహ్మణులకు రుచించలేదు.

శబరి తాను అపరాధం చేసినట్లు భావించి మహర్షితో "మహాత్మా! మీ ఆశ్రమంలో ఆశ్రయం కోరినందులకు నన్ను క్షమించండి. నేను కడజాతి స్త్రీని" మహర్షి ఆమెను ఆశ్రమం వదలి వెళ్లమన్నారు. ఆమె వెళ్లిపోయింది. దూరంగా ఒకకుటీరంలో సాధన కొనసాగించింది.

ఒకనాడు శబరి స్నానం చేయడానికి సమీపంలోని నదికి వెళ్తున్నది. ఒక బ్రాహ్మణుడు స్నానం చేసి తిరిగి వస్తున్నాడు. పొరపాటున తనకెదురుగా వస్తున్న బ్రాహ్మణునకు ఆమె చీరకొంగు తగిలింది. బ్రాహ్మణుడు కోపంతో ఊగిపోతూ ఆమెను శపించాడు. ఆయన తిరిగి నదికి స్నానానికి వెళ్లాడు. అతడు నదిలో దిగిన వెంటనే నదిలోని నీరు ఎర్రగా మారి అందులో పురుగులు కదలాడసాగాయి. సద్భక్తురాలిని నిందించిన కారణంగా అలా జరిగిందని తెలిసికొన్న ఆ బ్రాహ్మణుడు తన తప్పును గ్రహించి శబరిని సమీపించి క్షమాపణవేడాడు.

కొన్ని సంవత్సరాలు గడచి పోయాయి. శ్రీరామచంద్రుడు కైకేయి ఆనతి మేరకు వనవాసం చేస్తూ దండ కారణ్యానికి విచ్చేశాడు. శబరి ఆశ్రమం దర్శించాడు.

శబరి శ్రీరామచంద్రునికి మధురఫలాలను సమర్పించింది. ఆమె భక్తి ఎంత గొప్పదంటే ప్రతి పండును ముందు తాను రుచి చూసి తియ్యగా ఉందోలేదో అని తెలిసికొన్న తర్వాతే ఇచ్చింది.

శ్రీరామచంద్రమూర్తి సంతోషపూర్వకంగా వాటిని తిని ఆనందించాడు. అవి శబరి అనే శూద్ర స్త్రీ ఎంగిలి చేసినదని ఆయన భావించనేలేదు. అమె భక్తి అంత నిశ్చలమయింది.

ఒకరోజు మహర్షులంతా చేరి శ్రీరామచంద్రమూర్తిని దర్శించి ఇలా ప్రార్థించారు. "ఓ భగవంతుడా! మా పరిసరంలోని నదీ జలం అంతకు పూర్వం స్వచ్ఛంగా ఉండేది. ఎరుపు రంగుగా మారడానికి కారణం ఏమిటి? ఆయన వెంట వచ్చిన ఆయన సోదరుడు లక్ష్మణుడు వారికి ఇలా చెప్పాడు.

"బ్రాహ్మణులు మతంగిమహర్షిని బహిష్కరించడం. రామ భక్తురాలు శబరిని అవమానించడమే నదీ జలం కలుషితం కావడానికి కారణం"

"మహర్షులు తిరిగి ఆయనతో స్వామీ! మాకు స్నానపానాదులకు ఆ నది ఒక్కటే ఆధారం. ఆ నది నీరు తిరిగి స్వచ్ఛంగా కావటానికి మార్గమేమీ లేదా" అని ప్రార్థించారు.

దానికి లక్ష్మణుడిలా బదులు చెప్పాడు. "ఖచ్చితంగా మార్గం ఉంది. శబరి ఆ నదిలో స్నానమాడిన తక్షణం దాని అపవిత్రత తొలగిపోతుంది. జలం శుద్ధి అవుతుంది" మహర్షులు శబరి చెంతకు వెళ్లి నదిలో స్నానం చేయమని కోరారు. ఆమె అందుకు సమ్మతించింది. నదిలోని నీరు శుభ్రంగా స్వచ్ఛంగా మారాయి.

వారంతా శబరికి కృతజ్ఞతలు తెలిపారు.

## 14. భక్త కనకదాసు

కర్ణాటకలోని ధార్వాడ్ జిల్లా బడాగాంవ్(పెద్దగ్రామం)లో కనకదాసు అనే భక్తకవి వేటగాండ్ల కులంలో జన్మించాడు.

ఒకనాడు అతడొక తన సమీపంలోని పెద్దబండరాయిని కదిలించాడు. ఆ బండ క్రింద చాలా బంగారు నాణేలు కన్పించాయి. అవి అన్నీ తన కోసం ఉంచుకోకుండా పేదలందరికీ పంచిపెట్టాడు. అతడొక గొప్ప గురువు వద్ద శిష్యరికం చేస్తూ వచ్చాడు.

ఒకనాడు గురువు తన శిష్యులందరికీ – కనకదాసుతో సహా – పిలిచి తలకొక అరటిపండు నిచ్చి "మిమ్ములను ఎవరూ చూడకుండా తినండి" అని ఆదేశించాడు. ఇతర శిష్యులు కొందరు చెట్లు చాటున, మరి కొందరు ఇంటి చాటున చేరి పండును తినివేశారు. కనకదాసు తన కిచ్చిన పండును తినటానికి ఎక్కడకూ వెళ్లలేదు.

"కనకదాసూ! మీ అందరికీ అరటిపండు నిచ్చి తినమని చెప్పాను కదా! తిన్నావా? లేదా?" అని గురువు ప్రశ్నించాడు.

కనకదాసు ఇలా బదులు చెప్పాడు.

"ఔను! గురుజీ! నేను ఎక్కడకు వెళ్లినా దైవం కన్పిస్తూనే ఉన్నాడు. దేవుడు ప్రతిచోట ఉంటూ అందరినీ గమనిస్తున్నాడు. భగవంతుడు లేని చోటు నాకు కనిపించలేదు. అందుచేత మీరు చెప్పినట్లు నేను అరటిపండు తిన లేకపోయాను."

గురువు గారు పరమానందంతో "ఓయీ! కనకదాసూ! నీవు నిశ్చయంగా గొప్ప భక్తుడవే సందేహంలేదు. నీలాంటి శిష్యుడు దొరికి నందులకు నేను గర్విస్తున్నాను" అన్నాడు.

శ్రీకృష్ణభగవానుడు వేంచేసివున్న 'ఉడిపి' ఈ నాటికీ గొప్పక్షేత్రం. అక్కడి దేవాలయంలో గొప్ప ఉత్సవం జరుగుచున్న సమయమది. వేల కొలది భక్తులు అక్కడ గుమిగూడారు.

కనకదాసు చేతిలో సంగీత వాద్యం పూని అక్కడకు చేరి భక్తి గీతాలు గానం చేయసాగాడు. అక్కడి అర్చక స్వాములు "నీవు కడజాతి వాడవు ఆలయంలో ప్రవేశించడానికి నీకు ఎంత ధైర్యం?" అంటూ వానిని వెడలగొట్టారు.

కానీ, కనకదాసు అక్కడ నుండి కదలలేదు. భక్తి గీతం ఆలపిస్తూ అక్కడే నిలిచాడు.

ఒక అర్చకుడు అతణ్ణి అక్కడినుండి తరిమివేశాడు. కనకదాసు ఆలయ ప్రదక్షిణం చేస్తూ గుడి వెనుక భాగాన నిలిచాడు. ఆతడు పరంధాముణ్ణి ఇలా ప్రార్థించాడు. "శ్రీకృష్ణా! మాధవా! నీ ఆలయంలో నీ దర్శనాన్ని నేను పొందలేకపోవడానికి నేను చేసిన నేరం ఏమిటి? ఈ పలుకుల వెలువడినంతనే పెద్దశబ్దం వినిపించింది." ఆలయం వెనుక గల గోడ చీలి రెండుగా విడిపోయింది. శ్రీకృష్ణుని విగ్రహం అటువైపుకు తిరిగి కనకదాసుకు అభిముఖంగా కన్పించింది.

కనకదాసుకు శ్రీకృష్ణభగవానుని దర్శనం అతి దగ్గరలో లభించింది. ఆతడు ధన్యుడు.

ఈ నాటికీ ఆలయం వెనుక పగులువారిన గోడ అలాగే వుంది. దానిని **"కనకుని గండి"** అనిపేరు. (కన్నడంలో 'కనకన గండి' అంటారు)

కనకదాసు రచించిన హరిభక్తసార, అనే భక్తి గీతాల సంకలనం ఈ నాటికీ సంగీత విద్వాంసులు గానం చేస్తున్నారు.

## 15. ఝాన్సీ లక్ష్మీబాయి

వారణాసిలో దసరా ఉత్సవాలు వైభవంగా ప్రారంభమయినాయి.

స్నాన ఘట్టాలలో వేలాది మంది భక్తులు ఎత్తైన శిఖరాల పైన నిలబడి ఉత్సవాలను దర్శిస్తున్నారు.

అందంగా అలంకరించబడిన పడవలో కూర్చొని రెండవ పీష్వాబాజీరావు, ఆయన సోదరుడు, రాజభవన సిబ్బంది, మోరోపంత్‌తాంబే ఇతర రాజకుటుంబీకులు ఉత్సవాలని తిలకిస్తున్నారు. మోరోపంత్ ఏడేళ్ల కుమార్తె మను కూడా అక్కడే వుంది.

అకస్మాత్తుగా గంగానదిలో నుండి ఒక మొసలి బయటకు వచ్చింది. జనం పెద్దగా మొసలి.. మొసలి అంటూ కేకలు వేయసాగారు.

నదిలోస్నానం చేస్తున్న బాలురవైపు ఆ మొసలి తరుముకొని వస్తున్నది. ఒక బాలుడు మొసలి, మొసలి అంటూ బిగ్గరగా అరిచాడు.

ఒక్క బాలుడు మాత్రం స్నాన ఘట్టాలలో ఈత కొట్టసాగాడు. పడవ నడిపేవాండ్లు, సిపాయిలు, ప్రేక్షకులుగా నిస్సహాయులై చూస్తున్నారు.

బాలుని సమీపిస్తున్న మొసలిని 'మనూ' కూడా చూసింది. ఆమె, తల్లిదండ్రులు ఇతరులు చూస్తుండగా నదిలోనికి దుమికి బాలుని చేజిక్కించుకొని దగ్గరలో గల పడవలోనికి చేర్చింది.

తిరిగి తన వారిదగ్గరకు చేరింది. తండ్రి ఆమెను శరీరానికి హత్తుకుంటూ "అమ్మాయీ! నీ ప్రాణాన్ని పణంగాపెట్టి అపాయంలోవున్న బాలుణ్ణి రక్షించావు! నీ కెంత ధైర్యం! ఆపదలో వున్న వారిని కాపాడటానికి నీకు ఎంతదయ! అని అభినందించాడు.

ఈ బాలిక ఎవరోకాదు! చరిత్రలో ప్రసిద్ధిగాంచిన ఝాన్సీ రాణీ లక్ష్మీబాయి.

స్వాతంత్ర్యం కోసం ఆమె బ్రిటిష్‌వారితో వీరోచితంగా పోరాడిన ధీరవనిత.

## 16. జయ దేవుడు - అష్టపదులు

'గీతగోవిందం' రచించిన జయదేవుడు 'జగన్నాథపురి' సమీపంలోని ఒక గ్రామంలో జన్మించాడు. ఆయన గొప్ప శ్రీకృష్ణభక్తుడు. మహాకవికూడా! 'గీతగోవిందం' అష్టపదులుగా రాయబడింది. ఆయన భార్య పద్మావతి మిక్కిలి భక్తితో భర్తను సేవించేది.

జయదేవుడు 18 అష్టపదులు రచించిన తరువాత 19వది ప్రారంభింపదలిచాడు. అందులో శ్రీకృష్ణుడు తన ప్రేయసిని ఎలా ప్రార్థిస్తాడో వర్ణించాల్సివుంది. రాతప్రతిని మూసివేసి జయదేవుడు స్నానానికి వెళ్లాడు. తర్వాత కొంత సేపటికి స్నానం చేసి తిరిగి వచ్చాడు.

రాతప్రతిని చేతిలో తీసికొని చూడగా అందులో తాను రాయ తలపెట్టిన 19వ అష్టపది పూర్తిచేయబడినట్లు కనుగొని ఆశ్చర్యపోయాడు జయదేవుడు భార్యతో "పద్మా! ఈ పద్యం ఎవరు రాశారు? అని అడిగాడు. ఆమె తనకు ఏమీ తెలియదని చెప్పింది. శ్రీకృష్ణభగవానుడే స్వయంగా వచ్చి దానిని రచించినట్లు జయదేవుడు గుర్తించాడు.

భార్య పద్మావతీదేవితో "నేను స్నానం సగం ముగించి రాత ప్రతికోసం అడిగి దీనిని రాయలేదు. శ్రీకృష్ణభగవానుడే మారు వేషంలో నా రూపంలో

వచ్చి దీనిని పూర్తి చేశాడు. శ్రీకృష్ణుని దర్శనం పొందిన నీవు అదృష్టవంతురాలివి" అన్నాడు జయదేవుడు.

ఒకసారి రాజబంధువు ఒకరు చనిపోయారు. తన భర్తతో సహగమనం చేయాలని ఆ చనిపోయిన వ్యక్తి భార్య నిశ్చయించుకుంది.

ఈ సన్నివేశం తిలకించడానికి రాజుతో సహా నగరం యావన్మంది స్మశానంవద్ద గుమిగూడారు. ఆ రోజు పద్మావతీ, మహారాణిని కలిసింది" మీరు ఈ అపూర్వ దృశ్యం తిలకించడానికి వెళ్లటం లేదా అని మహారాణి పద్మావతిని అడిగింది. మహారాణి "లేదమ్మా! అందులో నాకు ఏలాంటి ప్రత్యేకత కనిపించలేదు. ఆమె భర్తను అమితంగా ప్రేమించివుంటే తక్షణం ప్రాణాలు వదలాల్సింది. భర్త మరణానంతరం శరీర త్యాగంలో అర్థంవేరు" అంటూ తన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పింది.

మహారాణి తన అభిప్రాయంతో ఏకీభవిస్తున్నారా? అని పద్మావతిని ప్రశ్నించింది. పద్మావతి" భర్తను భగవంతునితో సమానంగా ప్రేమించే ఏ స్త్రీ విషయంలోనైనా అది తప్పక సంభవిస్తుంది అని బదులిచ్చింది.

"అయితే నీ అభిప్రాయాన్ని ఏదో ఒక రోజున పరీక్షిస్తున్నాను" అన్నది మహారాణి.

ఒకరోజు వేటకు వెళ్లిన మహారాజును అనుసరించి జయదేవుడు అడవికి వెళ్లాడు.

ఆ సమయంలో పద్మావతి మహారాణి చెంత ఉంది. రాణి రహస్యంగా సేవకుని పిలిచి అతనితో చెప్పింది. "నేనూ పద్మావతి మాట్లాడుతున్నప్పుడు నీవు అడవికి వెళ్లినట్లున్నూ అక్కడ జయదేవుణ్ణి పులి చంపివేసినట్లు నీవు చెప్పాలి" అన్నది. సైనికుడు రాణిగారు చెప్పినట్లే చేశాడు.

తన భర్తమరణవార్త విన్నంతనే పద్మావతి ప్రాణాలు తక్షణం విడిచింది.

మహారాణి మ్రాన్పడి పోయింది. తన మూర్ఖపు చర్యకు మిక్కిలి విచారించింది.

రాజుగారికి, జయదేవునికి ఈ వార్త తక్షణం చెప్పి పంపింది.

జయదేవుడు రాణిని రాజును ఓదారుస్తూ అదంతా శ్రీకృష్ణుని లీల అని సమాధానపడ్డాడు.

## 17. ఏకనాథుడు - కుష్ఠురోగి

మహాభక్తుడైన ఏకనాథుడు తండ్రి ఆబ్దికం పెట్టాల్సిన రోజు అది. బ్రాహ్మణులకు సంతర్పణ చేసే సంప్రదాయానికి భిన్నంగా ఏకనాథుడు పేదలను, కడజాతి వారిని పిలిచి గొప్ప విందు చేశాడు. ఈ విషయం తెలుసుకున్న బ్రాహ్మణులు మూకుమ్మడిగా ఏకనాథుని ఇంటిపైకి దాడి చేసి ఆయనతో "తద్దినం రోజున బ్రాహ్మణ సమారాధన సంప్రదాయం దాన్ని వమ్ము చేసిన నిన్ను నేటినుండి కులం నుండి వెలివేస్తున్నాం. సక్రమంగా ప్రాయశ్చిత్తం చేసికొనకుంటే నిన్ను తిరిగి కులంలోనికి రానీయం" అని హెచ్చరించారు.

ఏకనాథుడు వారి సూచనను అంగీకరించాడు. నదిలో స్నానం చేసి తద్దినం పెట్టాడు. అందరూ కలసి తిరిగి వస్తుండగా కుష్ఠురోగి ఒకడు తారసపడి ఏకనాథునితో "అయ్యా! నేను పొరుగూరి వాడను. శివభక్తుణ్ణి. నేను క్రమం తప్పక శివారాధన చేస్తూ ఉంటాను. నిన్న రాత్రి మహాశివుడు కలలో సాక్షాత్కరించి మిమ్ము దర్శించమన్నాడు. మీరు కడజాతి వారికి అన్నదానం చేసి అనంతమయిన పుణ్యం సంపాదించుకున్నారు. అందులో కొంత భాగం నాకిస్తే నావ్యాధి నయమౌతుంది.

ఏకనాథుడు మరొక మాటలేకుండా తన పుణ్యంలో అతనికి భాగమివ్వదలచి నదినుండి నీరు తెచ్చి కుష్ఠురోగిపై చిలకరించాడు.

ఆశ్చర్యకరంగా అతని వ్యాధి పూర్తిగా నయమయింది. బ్రాహ్మణులు ఏకనాథుని ఔన్నత్యం గుర్తించి క్షమాభిక్ష వేడారు.

## 18. స్వయంకృషివిలువ అపారం

ఒక సదాచారుడైన బ్రాహ్మణుడు ఆ దేశపు రాజును దర్శించి తన కుమార్తె వివాహానికి ఆర్థిక సాయం చేయమని ప్రార్థించాడు.

రాజు కోశాధికారిని పిలిచి బ్రాహ్మణునికి ఒక వేయి బంగారు నాణేలు ఇవ్వమని ఆదేశించాడు.

బ్రాహ్మణుడు "ఓ రాజా ఈ సొమ్ము వివాహం చేయడానికి సరిపోదు" అన్నాడు.

రాజు కోశాధికారితో రెండువేల బంగారు నాణేలు ఇవ్వమని ఆజ్ఞాపించారు.

అయినా బ్రాహ్మణునికి తృప్తి కలుగలేదు. రాజు ఈ దఫా పదివేల నాణేలు ఇవ్వాల్సిందిగా ఉత్తర్వు చేశారు. అప్పటికీ బ్రాహ్మణునికి తృప్తి కలుగలేదు. రాజు కోశాధికారితో ధనాగారం తెరచి బ్రాహ్మణునికి ఎంత కావాలో అంత తీసికొని పెండ్లి వైభవంగా జరిపించమన్నాడు.

అప్పటికీ సంతృప్తి చెందని బ్రాహ్మణునితో రాజుతో "ఓ! రాజా! మీ ఔదార్యానికి నేను కృతజ్ఞుడను. మీరు ఇవ్వజూపిన సంపద మీకు సంక్రమించినది. నాకు ఎంత స్వల్ప మొత్తమయినా సరే స్వశక్తి మీద ఆర్జించినది నాకు కావాలి" అని కోరాడు.

రాజుగారు బ్రాహ్మణుని మర్నాడు తన సన్నిధికి రావలసిందిగా ఆనతిచ్చాడు.

మారు వేషంలో రాజు పనికోసం వెళ్లాడు. ఒక వడ్రంగి దగ్గరకు వెళ్లి చాల కష్టపడిపని చేసి రెండు రాగి నాణేలు దినసరి వేతనంగా సంపాదించాడు.

మర్నాడు రాజు సన్నిధికి వచ్చిన బ్రాహ్మణునికి రెండు రాగినాణేలు ఇస్తూరాజు “నేను ఎంతో కష్టపడి ఇంత మాత్రమే సంపాదించ గలిగాను” అన్నారు.

మిక్కిలి సంతృప్తి చెందిన బ్రాహ్మణుడు ఆ రెండు నాణేలతో ఇంటికి వచ్చాడు జరిగిందంతా భార్యకు వివరించాడు. భార్య ఆతణ్ణి దూషిస్తూ “నీకు బుద్ధిలేదు రాజు ఇవ్వజూపిన ధనం నిరాకరించావు” అంటూ ఆ రెండు రాగి నాణేలును విసరి వేసింది. ఆ నాణేలు పడిన చోట రెండు వృక్షాలు వెలిశాయి. వీటి కొమ్మల నుండి బంగారునాణేలు, రత్నాలు, ముత్యాలు ఉండటంతో దంపతులు ఆశ్చర్యచకితులైనారు.

బ్రాహ్మణుడు తన కుమార్తె వివాహాన్ని అత్యంత వైభవంగా జరిపాడు. రాజు, రాణి, పరివారం అంతా విచ్చేశారు.

## 19. రఘువంశ ఆవిర్భావం

దిలీపచక్రవర్తికి సంతతి లేదు. ఆయన భార్య సుదక్షిణతో కలసి సూర్యవంశజుల రాజగురువు అయిన వశిష్ఠముని ఆశీస్సులకోసం ఆయన ఆశ్రమానికి వెళ్లాడు. ఆయనను ఇలా ప్రార్థించాడు.

రాజు ‘‘పూజ్య మహర్షి! నా తర్వాత రాజ్యమేలడానికి మాకు సంతతిలేదు” అని దుఃఖించాడు. వశిష్ఠులు రాజుతో “ఓ రాజా! నీకు సంతతి కలుగని కారణం ఒకటుంది.

“నీవు ఒకసారి ఇంద్రలోకం వెళ్లి దేవేంద్రునికి సాయం చేసి తిరిగి వస్తూ దివ్యధేనువయిన కామధేవునుకు గౌరవ పురస్సరంగా ప్రదక్షిణ చేయలేదు. ఆ ధేనువు తనపట్ల అగౌరవం ప్రదర్శించిన నీకు పిల్లలు లేకుండేనట్లు శపించింది. పెద్దలను గౌరవించనివారు సుఖంగా జీవించలేరు.

రాజు మహర్షితో “గురుదేవా! అది పొరపాటయిన నేను విముక్తుణ్ణి అయ్యే మార్గం తెలుప వలసిందిగా” ప్రార్థించాడు.

వశిష్ఠమహర్షి "దిలీపా! మా నందిని ధేనువు ఇప్పుడే తన వత్సతో సహావస్తుంది. మీదంపతులిద్దరు దాని సేవ చేయండి. మీ పాపం నశిస్తుంది. అని సెలవిచ్చాడు.

చక్రవర్తి దిలీపుడు భార్యతో కూడి మహాశ్రద్ధతో నందిని ధేనువును సేవిస్తూ కొంతకాలం ఆశ్రమంలోనే గడిపాడు. రాజు ధేనువు ఎక్కడికిపోతే అక్కడికి వెళ్తూ దానిని అపాయం నుండి రక్షిస్తూ వచ్చాడు.

ఒకనాడు ఒక సింహం వచ్చి నందిని మీదికి లంఘించి చంపబూనింది. దిలీపుడు ఒక బాణాన్ని సంధించి పులిని చంపదలిచాడు. కానీ ఆయన చేతులు కదలకనీక చచ్చుపడేటట్లు చేసిన కారణంగా బాణం ఎక్కుబెట్టలేకపోయాడు.

చిత్రంగా, సింహం మనుష్య భాషణంతో మాట్లాడటం ప్రారంభించింది.

"ఓ చక్రవర్తీ! నేను శివదూతను నీవునన్ను చంపలేవు. నాకు ఆకలిగా వుంది. దీనిని చంపి నా ఆకలి తీర్చు కోనివ్వు" అని పలికింది.

అప్పుడు దిలీపుడు, "ఓ సింహమా! నేను ఈ దేశానికి రాజును. నా భూభాగంలోగల ప్రాణులన్నిటినీ సంరక్షించడం నా బాధ్యత. ఆవును వదలి నన్ను చంపి నీ ఆకలి తీర్చుకో!" అని బదులిచ్చాడు.

అంతట నందినీ ధేనువు "ఓ చక్రవర్తీ! నేను శివభక్తుణ్ణి సింహంగా మారువేషం ధరించేలా చేశాను. నిన్ను పరీక్షించాను. వశిష్ఠుని అనుగ్రహంతో నన్ను ఎవ్వరూ చంపలేరు. నీ సేవాభావానికి నేను తృప్తుడనైనాను. నన్ను రక్షించడానికి నీ ప్రాణం అర్పించడానికి సిద్ధపడ్డావు. నీకు త్వరలో ఒక మగబిడ్డ కలుగగలడని" పలికింది.

రాణి సుదక్షిణ తర్వాత ఒక కుమారుని కన్నది. అతనికి రఘువు అని పేరు పెట్టారు. ఆ వంశం అతని పేరనే పిలవబడుతున్నది.

శ్రీమహావిష్ణువు. శ్రీరామచంద్రమూర్తిగా ఈ వంశంలోనే అవతరించాడు.

## 20. అభిరామ భట్

మృక్కడయూర్ అనే గ్రామంలో అభిరామభట్ అనే బ్రాహ్మణుడుండే వాడు. అతి చిన్న వయస్సుననే అతడు సంగీతంలో తన ప్రతిభ కనపరచాడు. ఆయన జగజ్జనని "అభిరామి" భక్తుడు. ఆతడు లౌకిక విషయాలకు దూరస్థుడు. ప్రజలు అతణ్ణి పిచ్చివానిగా జమకట్టారు.

ఆకాలంలో శరభోజీమహారాజు తంజావూరును పాలిస్తున్నాడు. ఒక పౌర్ణమినాటిరాత్రి రాజు తిరుక్కడయూర్ విచ్చేశాడు. దేవాలయంలో నిశ్చలభక్తితో దివ్యమాతను సేవిస్తున్న అభిరామ భట్టును చూచాడు. మైమరచి ప్రార్థిస్తున్న ఆవ్యక్తి ఎవరూ అని అర్చకుణ్ణి అడిగాడు.

పూజారి నిర్లక్ష్యంగా "ఓ రాజా! అతడొక పిచ్చివాడు. అతనికి వేదాలపట్ల గౌరవంలేదు. అనామకుడైన దేవతను కొలుస్తుంటాడు" అని తెలిపాడు. రాజుగారికి ఆతనితో మాట్లాడాలని అనిపించింది. "భట్టా! ఈ రోజు తిథి ఏమి? అని అతణ్ణి ప్రశ్నించాడు. భట్టు" అమ్మ అభిరామివైపు ఒకసారి చూచి ఇలా రాజుగారితో –

"ఈనాడు పౌర్ణమి". నిజానికి ఆనాడు పౌర్ణమి కాదు. రాజుగారు కూడా లోకులు తలచినట్లే భట్టు పిచ్చివాడనే అనుకున్నాడు.

రాజుగారి అక్కడినుండి వెళ్లిన తర్వాత భట్టు తాను తప్పుగా సమాధానం చెప్పినట్లు గ్రహించాడు. వెంటనే అమ్మను వేడుకున్నాడు. "ఓ దివ్యమాతా! నన్ను కాపాడు. నేను చెప్పిన అబద్ధాన్ని నిజం చేయాలి".

దేవాలయ ప్రాంగణంలో ఒక గుంట త్రవ్వాడు. అందులో అగ్నిని ప్రజ్జ్వలింప చేశాడు. ధ్యానం చేయసాగాడు. అమ్మవారితో నిష్ఠూరంగా

"దివ్యమాతా! నా ప్రార్థన మన్నించకపోతే నేను అగ్ని ప్రవేశంచేసి మరణిస్తాను. అని శపథం చేశాడు. గుంటలో అమర్చబడిన బల్లపై కూర్చొన్నాడు. ఆ బల్ల పై కూర్చొన్నాడు. ఆ బల్ల నూరు తాళ్లతో కట్టబడివున్నది. భట్టు అమ్మవారిని గూర్చి పాటల రచన ప్రారంభించాడు. ప్రతి పాటకు ఒక తాడును కోసేవాడు డెబ్బది తొమ్మిది పాటలు పూర్తయేసరికి చీకటి పడసాగింది. దివ్యజనని సాక్షాత్కరించింది. భట్టు ఆమెతో "అమ్మా! నా కనులకు వెలుగు ప్రసాదించు" అని వేడుకున్నాడు. పాట రచన కొన సాగించాడు. దివ్య జనని తన కర్ణాభరణాన్ని ఆకాశంలోనికి విసిరింది. అది పూర్ణచంద్రుని వెలుగు వలె భాసిల్లింది. అమ్మ, భట్టుతో "నా ప్రియమైన బిడ్డా! నీ మాట నిజం అయ్యేటట్లు చేశాను. నీ పాటలు కొనసాగించు" అని అంతర్ధానమయింది.

'మహాద్భుతం! భట్టు గావించిన మాయాజాలం' అంటూ ప్రజలు కేరింతలు కొట్టారు.

రాజు కూడా బయటకు వచ్చి ఆకాశంలో వెలుగును గమనించాడు. ఆయన భట్టు చెంతకు పరుగు పరుగునా వచ్చాడు.

వంద పాటలుగల **"అభిరామ అంతాది"** సృజించిన భట్టుకు పాదాభివందనం చేశాడు. పెద్ద మొత్తంలో ధనం కూడా అందజేశాడు.

## 21. స్కాందపురాణం

కాంచీపురంలో కుమరన్ కోట్టం శివాచార్యుడనే పూజారి ఉండేవాడు. మురుగన్ కరుణతో ఆతనికి కలిగిన కుమారుడే కాసెప్ప అతి చిన్న వయస్సులోనే కాసెప్ప తమిళ, సంస్కృత భాషలను పుక్కిట పట్టాడు.

ఒకనాడు కాసెప్పకు మురుగన్ కలలో సాక్షాత్కరించి స్కాందపురాణంలో తన ఖ్యాతిని దానం చేయమన్నాడు.

కాసెప్ప "ఓ దయానిధీ! నిన్ను కీర్తించ నేను ఎంతవాడను? అని మొరపెట్టుకున్నాడు.

మురుగన్ అతణ్ణిప్రోత్సాహపరుస్తూ "విచారపడకు! నేను మొదటి పాదం పలుకుతాను. మిగతా పాట అంతా నీవు పూర్తిచేయి" అని భరోసా ఇచ్చాడు.

మురుగన్ పాదాలచెంత కూర్చొని కాసెప్ప పాటలు రాయడం మొదలుపెట్టాడు. అవి పూర్తి కాగానే మురుగన్ పాదాల చెంత ఉంచాడు. ఆలయం తలుపులు మూసి ఇంటికి చేరుకున్నాడు. మర్నాడు ఆలయానికి రాగానే తన రాతప్రతి మురుగన్ చేత సంస్కరింపబడడం గమనించాడు.

గ్రంథం పూర్తి కాగానే కాసెప్ప ప్రముఖ పండితులను భక్తులను ఆహ్వానించాడు. ఆయన వినాయకుణ్ణి, రాతప్రతిని ముందుగా పూజించాడు. అందరి ఎదుట ఆ పాటలను పాడసాగాడు.

స్వామికి పదిచేతులు ఐదుముఖాలు ఉన్నట్లుగా పాటలలో వర్ణించాడు కాసెప్ప. పండితుల గుంపులోని ఒక పండితుడు లేచి "ఓ! కాసెప్ప! పాడటం ఆపు, నీ పాట మొదటి పాదంలోనే వ్యాకరణ దోషం ఉంది" అన్నాడు.

కాసెప్ప "అయ్యా! ఇవన్నీ స్వామి చేత సంస్కరించబడ్డాయి. ఇందులో తప్పులు ఎట్లావుంటాయి? అని ప్రశ్నించాడు. కాసెప్ప పాడటం ఆపేశాడు. అందరూ ఎవరి దారిని వారు వెళ్లిపోయారు. తిరిగి మరునాడు అందరినీ రమ్మనమని అప్పుడు వివరణ ఇవ్వగలనని కాసెప్ప పండితులందరికీ తెలిపాడు.

కాసెప్ప మురుగన్‌తో మొర పెట్టుకొన్నాడు "ఓ దేవా! నిన్నే తప్పుపట్టి పండితులు అగౌరవపరిచారు. నీవు గనుక నాకు రక్షణగా రాకపోతే నాకిక మరణమేశరణ్యం" స్వామి సాక్షాత్కరించి "నా ప్రియభక్తుడా! భయపడకు రేపు నేనే వచ్చిపండితులకు సమాధానం చెప్తాను" అని అభయమిచ్చాడు. మరునాడు అందరూ ఆలయంలో సమావేశమైనారు. కాసెప్పను పండితులు

వివరించమని కోరారు. ఇంతలో సభలో నుండి వ్యక్తి లేచి చెప్పసాగాడు. ''నేను వివరిస్తాను. ఇక్కడొక పవిత్ర గ్రంథమున్నది. దాని పేరు **"వీరశోలీయమ్"** ఇందులోని తొలివాక్యం అదే పదాలతో అదే వ్యాకరణంతో వున్నది. దీనిని పండితులందరూ ఆమోదించియే ఉన్నారు.

ఆ వివరణ ముగియగానే ఆ వ్యక్తి కనుపించకుండాపోయాడు. అందరూ గుర్తించారు "ఆ వచ్చింది కుమారస్వామియే" అని ఒక సంవత్సరంలో కాసెప్ప స్కాందపురాణం పూర్తిచేశాడు. భక్తులందరూ గ్రంథాన్ని ఊరేగింపుగా తీసికొని వెళ్లి కాసెప్పను సన్మానించారు.

## 22. మహాభక్తుడు పూందనం

పూందనం, గురువాయూరప్ప భక్తుడు. ఆయన మిత్రుడు నారాయణకవచం రచించిన భట్టసిరి వానికొక బంగారు ఉంగరం బహూకరించాడు. పునాతనం దానిని ఎల్లవేళలా ధరించేవాడు.

ఒకసారి భగవద్దర్శనానికి గురువాయూర్ వెళ్తూ పూందనం మధ్యలో అడవి గుండా పోతున్నాడు. కొందరు దొంగలు, అకస్మాత్తుగా పూందనం మీద దాడికి దిగారు. తన దగ్గరవున్నదంతా ఇచ్చేయమని గద్దించారు. ఆయన చేతులను కట్టిపడేశారు. పూందనం ఇష్టదైవం గురవాయూరప్పను ప్రార్థించి కాపాడమన్నాడు. దొంగలు బిగ్గరగాకేకలు వేశారు "గొడవ చేయకు నిన్ను రక్షించడానికి ఎవ్వరూ ఇక్కడకు రారు" అని ఆతణ్ణి హెచ్చరించారు. ఇంతలో తమ వైపు దూసుకవస్తున్న ఒక గుంపు సందడి వినిపించింది. దొంగల పారిపోయారు. అక్కడకు వచ్చిన వారెవరో కారు. గురవాయురప్ప మంత్రి, సైనికులు. వారు వెంటనే పూందనం చేతులను కట్టివేసిన తాళ్ళు తెంచివేశారు.

పూందనం వారికి కృతజ్ఞత చెప్తూ "భగవంతుడే మిమ్మల్ని ఇక్కడికి సకాలంలో పంపాడు. మీ సాయానికి బదులుగా నేనేమి చేయగలను! అన్నాడు. దానికి మంత్రి" నీ చేతివేలికి ఉన్న ఉంగరాన్ని నాకు ఇచ్చేయి"

అన్నాడు. పూందనం కాదనలేక తన వ్రేలిన వున్న ఉంగరాన్ని మంత్రికి ఇచ్చి వేశాడు.

పూందనం మర్నాడు దేవాలయానికి వెళ్లాడు. పూజారి ఆతనికి ఉంగరం ఇచ్చివేశాడు. పూందనం ఆశ్చర్యపోయాడు. పూజారితో అది తన వద్దకు ఎలా చేరింది తెలియగోరాడు. పూజారి అన్నాడు "రాత్రి భగవంతుడు నాకు కలలో కన్పించి తన పాదాల క్రింద ఒక ఉంగరం వుందనీ, దానిని తీసికొని నీకు ఇవ్వాలని" చెప్పాడు.

పూందనం ఆశ్చర్యపోయాడు. ఆయన ఇలా స్తుతించాడు. "హే! భగవాన్! నీకు భక్తులపట్ల ఎంత దయ? సహాయానికి నిన్న మంత్రిగా వేషం ధరించి వచ్చింది నీవే గదా!

నన్ను దోపిడి దొంగలనుండి కాపాడిన రక్షకుడవు నీవేగదా!"

## 23. శ్రీకృష్ణుని ప్రియతమ భక్తుడు భీముడు

పాండవులు వనవాసంలో వున్న దినాల్లో శ్రీకృష్ణభగవానుని ఒకసారి తమ నివాసంలో విందుకు ఆహ్వానించదలిచాడు.

పాండవ సోదరుల్లో ఒకరైన నకులుణ్ణి శ్రీకృష్ణుని వద్దకు పంపారు. శ్రీకృష్ణుడు తనకు ఆ రోజు వీలుకాదని చెప్పడంతో నకులుడు నిరుత్సాహంతో తిరిగి వచ్చాడు. అప్పుడు అర్జునుడు "కృష్ణ భగవానుడు, తనకు ప్రియతముడైనవాడు ఆహ్వానిస్తేనే గానీ రాడు" అంటూ అహంభావాన్ని చాటాడు.

"శ్రీకృష్ణుడు నన్నే అధికంగా ప్రేమిస్తాడు. నేనే ఆయనను విందుకు తీసుకొనివస్తాను" అంటూ అర్జునుడు బయలుదేరాడు.

కానీ, శ్రీకృష్ణుడు అర్జునునితో కూడా తాను ఆ ప్రత్యేక దినంనాడు విందుకు రాజాలనన్నాడు. చివరగా భీమసేనుడు బయలుదేరాడు. అందరూ

నవ్వారు. ప్రతిరోజు ఉదయాన్నే పాండవులందరూ – భీముడు తప్ప – ద్రౌపది సహా శ్రీకృష్ణుని ప్రార్థిస్తూవుంటారు. భీముడు మాత్రం ఆ సమయానికి ఇంకా నిద్రపోతూనే వుంటాడు. ఇతరులచేసే ప్రార్థన గూర్చి పట్టించుకునేవాడు కాదు. అందరూ ఒకే మాటగా అన్నాను. మన అందరిలో నీవే శ్రీకృష్ణుని చివరిభక్తుడవు. నీవు శ్రీకృష్ణుని పిలుచుకొని రావడం అసంభవం"

"కంగారుపడకండి! నేను పోయి ఆయనను పిలుచుకవస్తే సరి! మీరే చూస్తారుగా" అన్నాడు భీముడు. ఆయన ద్రౌపదితో "నీవు విందు పనులు చూసుకో! నేను శ్రీకృష్ణుని పిలుచుకొని వస్తాను'' అంటూ భీముడు వెళ్లిపోయాడు.

నేరుగా శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్లిన భీముడు.

"హే! శ్రీకృష్ణా! నీవు మాతో విందులో పాల్గొనకపోతే మాకు ఈ రోజు భోజనం ఉండదు. ద్రౌపది ఇప్పటికే విందు భోజనం తయారు చేసే పనిలో వుంది అంటూ తన చేతిలోని దండాన్ని పైకెత్తి ఇలా శపథం చేశాడు. "శ్రీకృష్ణుడు నాతో రాకపోతే ఈ దండం నా శిరస్సును ముక్కలు చేయుగాక"

శ్రీకృష్ణుడు శపథం వింటూనే నవ్వి "భీమా! నీవే నా నిజమయిన భక్తుడవు. నాకోసం ప్రాణత్యాగానికి సిద్ధపడినవాడవు" అంటూ భీముని వెంట విందుకు వెళ్లాడు. భీముడు శ్రీకృష్ణుని అంకితమైన భక్తుడు. కాని, ఇతరుల మాదిరి తన భక్తి ప్రదర్శించలేదు.

## 24. నారాయణ మంత్ర ప్రభావం

ఒకసారి నారదమహర్షి శ్రీమహావిష్ణువును సమీపించి ఇలా ప్రశ్నించాడు.

"మహానుభావా! నీ భక్తులందరి చేత మంత్రంగా ఉచ్చరింపబడుతున్న మీపేరులో గొప్పదనం(ఓం నమోనారాయణాయ అనే అష్టాక్షరీ మంత్రంలో)లో గొప్పదనం ఏమిటి?

భగవంతుడు సెలవిచ్చాడు.

"ఏ ప్రాణిచెవిలో అయినా 'నారాయణ' అనే నా పేరు ఉచ్చరించు. ఏమి జరుగుతుందో చూడు"

మహావిష్ణువు ఆజ్ఞానుసారం నారదుడు భూలోకం వెళ్లాడు. అక్కడ ఒక్క పురుగును చూచాడు. దాని చెవిలో 'నారాయణ' అని చెప్పాడు. ఆ పురుగు తక్షణం చనిపోయింది.

నారదుడు దుఃఖంతో ముందుకు సాగాడు. ఒక పూవు మీది వాలివున్న సీతకోకచిలుకను చూచాడు. దాని చెవిలో రెండు సార్లు 'నారాయణ' అని చెప్పాడు మరుక్షణం సీతాకోక చిలుక చనిపోయింది. నారదమహర్షి పుట్టిన జింకను చూచాడు. దానిలో ''నారాయణ'' అని చెప్పగానే అదీ కన్నుమూసింది. నారదుడు శ్రీమహావిష్ణువును దర్శించి జరిగిందంతా చెప్తూ" మహానుభావా! నేను 'నారాయణ' పదాన్ని చెవిలో చెప్పగానే పురుగు, సీతాకోకచిలుక, జింకపిల్ల పుట్టగానే మరణించాయి. నేను ఇక ఇతర ప్రాణులను చంపి పాపం. మూటగట్టుకొనలేను" అని విచారించాడు. తనకు నేరుగా నారాయణ మంత్ర ప్రభావం చెప్పాల్సిందిగా వేడుకున్నాడు. చివరిసారిగా తల్లి చెంతనున్న ఆవు దూడచెవిలో నారాయణమంత్రాన్ని చెప్పి చూడు" అని శ్రీమహావిష్ణువు నారదుణ్ణి ఆదేశించాడు.

నారదుడు అలాగే చేశాడు.

ఆవు దూడకూడా వెంటనే మరణించింది. చివరిగా భగవంతుడు నారదునితో "ఇదే కడసారి వారణాశిలో రాజుగారి కొక బాలుడు ఇప్పుడే పుట్టాడు. అక్కడికిపోయి వాని చెవిలో 'నారాయణ' అని చెప్పు అని ఆదేశించాడు. నారదుడు వారణాశికి వెళ్లాడు. రాజుగారు మహర్షిని అత్యంత గౌరవంతో స్వాగతం చెప్పాడు.

"మీరు నాకు బిడ్డ కలిగిన వెంటనే వచ్చారు. నేనెంతో ఆదృషవంతుణ్ణి" అన్నాడు రాజు.

నారదమహర్షి మూడుసార్లు నారాయణ మంత్రాన్ని అప్పుడే పుట్టిన బిడ్డ చెవిలో చెప్పాడు.

ఆ మంత్రం వినబడగానే బిడ్డ మాటలాడటం మొదలుపెట్టాడు.

ఓ! మహర్షీ! నమస్కారములు. నారాయణ మంత్ర మహిమ నీకు ఈ సరికి బోధపడివుంటుంది. "అంటూ ఆ బాలుడు ఇంకా ఇలా అన్నాడు. **"ఆ పురుగును నేనే! ఆ మంత్రం వినబడగానే సీతాకోక చిలుకనయినాను. చనిపోయి జింకనయినాను. తరువాత ఆవు దూడ నయినాను. చివరిగా మానవ జన్మలభించింది.** అది కూడా రాజ కుటుంబంలో పుట్టాను ఇది అంతా నారాయణమంత్ర ప్రభావమే" అంటూ రాకుమారుడు ముగించాడు.

"నారాయణ! నారాయణ" అంటూ నారదుడు భువినుండి దివికి వెళ్లాడు.

## 25. మహాదాత కర్ణుడు

పంచపాండవులలో ఒకరైన అర్జునుడు శ్రీకృష్ణభగవానునితో ఒకరోజు ఇలా అడిగాడు "ప్రజలు కర్ణుణ్ణి మహాదాతగా భావిస్తూ ఉంటారు. నేను కూడా ప్రజలు ఏది కోరితే అది ఇస్తున్నాను కదా! శ్రీకృష్ణ భగవానుడు తన అభిప్రాయాన్ని రూఢి చేసికొనటానికి పోటీ ఏర్పాటు చేశాడు.

మరునాడు శ్రీకృష్ణ భగవానుడు ఒక బంగారపుకొండ, మరొక వెండికొండ సృష్టించాడు. ప్రజలకు దాన్ని సన్నిహితంగ చూచే ఏర్పాటు చేశాడు. అర్జునునితో "అర్జునా! సాయంకాలం లోపల ఈ రెండు కొండలను వినిమయం చేయగలిగితే నిన్ను కర్ణునితో సమానునిగా పరిగణిస్తానన్నాడు. అర్జునుడు అందుకు అంగీకరించాడు. వెంటనే బంగారం దానం ఇవ్వబోతున్నానని ప్రజలందరకూ తెలిపాడు. అర్జునుడు కొండలను ముక్కలుచేస్తూ వచ్చిన వారందరికీ దానమిస్తున్నాడు. సాయంకాలం అయ్యేసరికి కొండలో సగభాగం మాత్రమే అతడు దానంగా పంచగలిగాడు.

శ్రీకృష్ణుడు, కర్ణునికి రావలసిందిగా వర్తమానం పంపాడు. సూర్యోదయం నుండి ప్రారంభించి సాయంకాలంలోగా రెండుకొండలను – వెండి, బంగారం – పంచిపెట్టమని కర్ణుని కోరాడు.

కర్ణుడు దారిని పోయే ప్రజలను పిలిచి "చూడండి! ఇవి రెండు కొండలు. ఒకటి బంగారం, ఒకటి వెండి. మీలో ఒకరు బంగారం అంతటినీ మిగతా వారంతా వెండి మొత్తాన్ని తీసికొని ఐశ్వర్యవంతులు కండి" అని ప్రకటించాడు, శ్రీకృష్ణ భగవానుడు అర్జునునితో చెప్పాడు. "కర్ణునికి" నీకూగల తేడా తెలుసుకో! నీవు ముక్కలు దానంగా ఇచ్చావు. కర్ణుడు కొండనే మొత్తంగా దానం చేశాడు అందుచేత కర్ణుడే మహాదాత"

## 26.పిప్పలాదుని మతిలేని వరం

వృత్రాసురుణ్ణి వధించడానికి దేవతల రాజైన ఇంద్రునికి వజ్రాయుధంగా తన ఎముకలను త్యాగం చేసిన దధీచి మహర్షి.

దధీచి కుమారుడే పిప్పలాదుడు. ఇంద్రుడు తన తండ్రిని వధించినట్లు భావించాడు. దధీకి మహర్షి ఇష్టాపూర్వకంగానే తన శరీరాన్ని త్యాగం చేశాడని అతనికి తెలీదు. ఆతడు ఇంద్రునిపై పగబట్టాడు.

పిప్పలాదుడు మహాశివుణ్ణి గూర్చి తపస్సు చేశాడు. మహాశివుడు ఆతని తపో దీక్షకు మెచ్చి ప్రత్యక్షమై వరంకోరుకొమ్మనినాడు.

పిప్పలాదుడు ''మహాప్రభో! నీ మూడోకన్ను తెరచి ఇంద్రాది దేవతలనందరిని సంహరించాలని" నా ప్రార్థన.

మహాశివుడు తాను మూడోకన్ను తెరచినట్లయితే లోకమే నశిస్తుందని తెలిపాడు. పిప్పలాదుడు తాను కోరినట్లే వరం కావాలని పట్టుబట్టాడు. మహాశివుడు "బాలకా! ప్రజలు కోపంతో ప్రతీకారం తల పెట్టినప్పుడు వారేమి చేస్తున్నారో వారికే కాలేదు. అయినా నేను నీవు కోరినట్లే నా మూడవ కన్ను తెరుస్తాను ఫలితాలు నీకే అనుభవంలోనికి వస్తాయి" అన్నాడు.

మహాశివుడు మూడోనేత్రాన్ని కొద్దిగా కదిలించాడు. పిప్పలాదునికి తన శరీరం దగ్ధమౌతున్నట్లు అనుభవం కలుగసాగింది. బాధతో పెద్దగా అరచాడు.

ఆతడు శివుని నిందిస్తూ "మహాప్రభూ! ఇంద్రుణ్ణి దేవతలను భస్మీకృతులను చేయకుండా నన్ను దహించి వేస్తున్నారు" స్వామి అన్నాడు. మహాశివుడు "బాలకా! నేను నిన్ను దహించటం లేదు. నేను దేవతలనే దహిస్తున్నాను. దేవతలు ఎక్కడవుంటారో తెలుసా! వారుప్రతివారి శరీరంలో ఉంటారు. నీ చేతిలో ఇంద్రుడు. నీ కంటిలో సూర్యుడు. నీ వాసనలో అశ్వినీ కుమారులు, నీ మనస్సులో చంద్రుడు ఉన్నారు. అందువలన నీకు దహించబడిన అనుభూతి కల్గుతున్నది.

పిప్పలాదునికి జ్ఞానోదయం కలిగింది. "మహాప్రభో! నేను సర్వదా నీ భక్తుణ్ణిగా ఉండే వరమియ్యమనేదే నా కోరిక. అది ఇవ్వ చాలు" అంటూ శివునికి సాగిలపడ్డాడు.

## 27. దివ్య గాయకుడు హరిదాసు

ఢిల్లీలో అక్బరు చక్రవర్తి ఆస్థానంలో తాన్‌సేన్ ప్రసిద్ధ గాయకుడు.

ఒకనాడు అక్బరు అతణ్ణి ప్రశంసిస్తూ "సంగీతంలో నీతో సమానమైన వారెవ్వరూలేరు" అన్నాడు.

తాన్‌సేన్ అందుకు అంగీకరించక, "లేదు మహాప్రభో! నా కంటె గొప్ప సంగీత విద్వాంసుడొకడు ఉన్నాడు" అన్నాడు.

చక్రవర్తి "ఆయన ఎవరు? ఎక్కడ ఉంటారు? అన్నాడు. "ఆయన పేరు హరిదాసు. ఆయన బృందావనంలో ఉండే గొప్ప తపస్వి" అని బదులిచ్చాడు తాన్‌సేన్.

చక్రవర్తి తాను ఆతని సంగీతం వినాలని కోరాడు. మంత్రికి సూచించాడు. ఆతణ్ణి మన సముఖానికి ఆహ్వానిద్దామని.

కాని, చక్రవర్తి అన్నాడు "ఆయన బృందావనం దాటి బైటకు రాడట. ఆయన జీవన సరళికి మనం ఆటంకం కల్గించరాదు. మరేదైనా మార్గం ఉందా, నేను ఆయన సంగీతం వినటానికి," అన్నాడు అక్బర్.

తాన్‌సేన్ – "మహాప్రభో! మీకు అంత పట్టుదలగా ఉంటే శిష్యునిగా వేషం వేసుకొని మారు వేషంలో బృందావనం వెళ్లవచ్చు" అని విన్నవించాడు.

చక్రవర్తి శిష్యునిగా మారు వేషంలో వెళ్లడానికి అంగీకరించాడు. తాన్‌సేన్ స్వయంగా చక్రవర్తిని బృందావనానికి తీసికొని వెళ్తానన్నాడు.

ఒకనాడు చక్రవర్తి, శిష్యుని వేషంలో తాన్‌సేన్‌తో కలసి బృందావనానికి వెళ్లాడు.

హరిదాసు కుటీరంలో గురువు సన్నిధిలో తాన్‌సేన్ గానం చేశాడు. కావాలనే పాడటంలో కొన్ని తప్పులు చేశాడు.

హరిదాసు "పాడటం అలా కాదు, నేను పాడుతాను చూడు" అని కొన్ని గీతాలు పాడాడు.

చక్రవర్తి హరిదాస్ గానానికి ముగ్ధుడై "భగవంతుడే గానం చేస్తున్నట్లున్నది. తాన్‌సేన్ నీవు ధన్యుడవు. నీ కింతటి మహత్తర గురువు ఉన్నాడు. ఈ గానం రాళ్లను సైతం కరిగించ గలిగింది అని ప్రశంసిస్తూ ఆయనకు ఇంతటి దివ్యకంఠం ఎలా వచ్చింది? అని ప్రశ్నించాడు. తాన్‌సేన్ "మహారాజా! నా గురువు నా లాగ మానవ మాత్రులకోసం గానం చేయడు. ఆయన గానం భగవంతునికి అంకితం" అన్నాడు.

చక్రవర్తి వ్యాఖ్యానిస్తూ "ఆ గానం భగవదర్పితం కావడంతో అది నిస్సందేహంగా దివ్యమైనదే! తాన్‌సేన్ గురువు హరిదాసు వైపుకు తిరిగి "గురూజీ! ఇప్పుడు నాతో వున్న మహనీయుడు సాక్షాత్ అక్బరు చక్రవర్తి. మీ సంగీతం వినడానికి శిష్యునిగా మారువేషం ధరించారనీ వారిని ఆశీర్వదించాల్సిందిగా ప్రార్థిస్తున్నాను" అని విన్నవించాడు.

ఢిల్లీ తిరిగి వెళ్తున్న అక్బరు చక్రవర్తి "ఆయన గానం నాలో మార్పు తెచ్చింది. అల్లాకు, హరికీ తేడా కన్పించలేదు" అని ప్రకటించాడు.

హరిదాసు అమరగానం ఈనాటికి బృందావనంలో విన్పిస్తూ ఉంటుంది.

## 28. మహాభక్తురాలు అళగి

రాజరాజ చోళుడు తమిళనాడుకు పాలకుడు. ఆయన మహాశివభక్తుడు. తన రాజధాని తంజావూరులో శివునికి ఆలయం నిర్మించ దలచాడు.

వేలమంది కార్మికులు రాత్రింబవళ్లు పనిచేయసాగారు. ఆ పట్టణంలో ఒక పేదరాలు నివసించేది. ఆమె పేరు అళగి. ప్రజలంతా దేవాలయం నిర్మాణంలో పాలు పంచుకొంటూ ఉంటే తాను ఏమి చేయలేకపోతున్నానని బాధపడుతూ ఉండేది. ఒకసారి ఒక ముదుసలి కూలి "అమ్మా నాకు దప్పికగా ఉంది కొంచెం మజ్జిగ ఇస్తావా" అని అడిగాడు.

అళగి వెంటనే అతనికి మజ్జిగ ఇచ్చి అతని దప్పిక తీర్చింది. ఆమె ఆలోచించసాగింది. "మహాశివునికి సేవ చేస్తున్న ఈ కూలీలందరికి మజ్జిగ అందజేస్తే బాగుంటుంది కదా! మహాశివునికి నా చేతనయిన సేవ ఇదే!" వెంటనే తన నిర్ణయాన్ని అమలు పరచింది. కూలీలందరకూ మజ్జిగ ఇవ్వడం ప్రారంభించింది. దాహం తీర్చుకున్న ఆమెను ఆశీర్వదించేవారు. "నీకు తప్పక ఈశ్వరానుగ్రహం కలుగుతుంది" అనే వారు.

శిఖరంపై నిర్మాణం తప్ప ఆలయ మిగతా భాగం పూర్తయింది. అంతా పూర్తయితే తనకు కూలీల సేవాభాగ్యం పోతుందని ఆమె చింతించింది. నిర్మాణానికిగాను ఇవ్వడానికి డబ్బు ఆమె దగ్గర ఏమాత్రమూ లేదు. చిత్రంగా ఆమె కుటీరానికి ఎదురుగా ఉన్న పెద్ద బండరాయి గుర్తు వచ్చింది.

వెంటనే ప్రధానశిల్పాచార్యుని దగ్గరకు వెళ్లింది. 'నా దొక చిన్నమనవి! తీరుస్తారా!' అని అడిగింది. 'చెప్పమ్మా! తప్పక చేస్తాను' అని అతడు బదులు పలికాడు.

అళగి ఆతనితో "నా ఇంటి ముందు ఒక పెద్ద రాతి బండ ఉంది. ఆలయ శిఖరంగా చెక్కడానికి దాన్ని ఉపయోగించు కొంటారా! అని ప్రశ్నించింది. అందుకు ప్రధాన శిల్పాచార్యుడు అంగీకరించాడు. ఆ రాత్రి కలలో రాజుగారికి మహాశివుడు కన్పించి "ఓ రాజా! నా విగ్రహాన్ని అళగి సమర్పిస్తున్న రాతిబండ క్రింద ఏర్పాటు చేస్తే చాల సంతోషిస్తాను" అని పలికాడు.

తెల్లవారి లేస్తునే శిల్పాచార్యుని పిలిపించి అతనిని తీసికొని రాజు ముసలి అవ్వ కుటీరానికి వెళ్లాడు. "అమ్మా! నీ మీద శివునికి ఇంతదయ కలగడాని కారణం ఏమిటి? అని రాజు అళగిని ప్రశ్నించాడు.

"ఓ రాజా! నేను ఆలయ నిర్మాణం పని చేస్తున్నప్పుడు దప్పిక గొన్న కూలీలకు మజ్జిగ ఇస్తూ వచ్చాను. నేను ఇప్పుడు ఇవ్వ గలిగింది ఈ రాతి బండమాత్రమే" అని రాజుకు బదులు చెప్పింది. రాజు ఆశ్చర్యంతో "అమ్మా! నీ అకుంఠిత భక్తితో శివుణ్ణి బంధించావు." రాజు దేవాలయం ముందు ఒక చెరువు తవ్వించాడు. అది అళగి చెరువుగా నేటికీ నిలిచి ఉంది.

## 29. దధీచి త్యాగం

అశ్వినీ కుమారులు దేవలోకంలోని వైద్యులు. వారికి బ్రహ్మ విద్య అభ్యసించాలని ప్రగాఢమైన కోరిక దేవేంద్రుడు అందుకు అడ్డుపడసాగాడు. అదే గనుక జరిగితే తన పదవికి భంగం కల్గుతుందని ఆతని భయం. అందుచేత ఇతరులెవ్వరూ వారికి బ్రహ్మవిద్య బోధించరాదని శాసించాడు. అతని ఆజ్ఞ ఉల్లంఘిస్తే శిరచ్ఛేదన చేయిస్తానని హెచ్చరించాడు.

కానీ, అశ్వినీ కుమారులు మహాతపస్వి దధీచిని సమీపించి తమను శిష్యులుగా స్వీకరించి బ్రహ్మవిద్యను ఉపదేశించవలసిందిగా ప్రార్థించారు.

ఆయన ఒకటే మాట అన్నాడు "విద్యార్థులు గురువను ఆశ్రయిస్తే భయంవల్లగాని దురాశతోగానీ వారిని నిరాకరించడం తగదు. అని ఇంద్రుని ఆగ్రహం నుండి తప్పించుకునే మార్గం అశ్వినీ దేవతలు.

"మేము మీ శిరస్సును ఖండించి దాని స్థానంలో అశ్వపు ముఖం అతికిస్తాము. మీ తలను భద్రపరుస్తాం. మీకు గుర్రపు ముఖంతోనే మాకు బ్రహ్మవిద్య నేర్పండి" అన్నారు.

ఇది తెలిసికున్న ఇంద్రుడు, దధీచి పై గొడ్డలి విసిరి ఆయనను చంపి వేశాడు. మృతులను జీవింపజేసే విద్య తెలిసిన అశ్వినీ కుమారులు దధీచిని బ్రతికించారు. దధీచి అశ్వినీ కుమారులకు బ్రహ్మ విద్యనేర్పాడు. తర్వాత అశ్వినీ కుమారులు దధీచి ఆశ్రమాన్ని వదలి వెళ్లారు. దధీచి తనను గొడ్డలితో చంపిన ఇంద్రునిపై ప్రతీకారంగా ఒక యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞశాల అగ్నిహోత్రం నుండి వృత్రాసురుడనే రాక్షసుడు పైకి వచ్చాడు. దధీచి అతణ్ణి దేవలోకానికి వెళ్లి ఇంద్రుణ్ణి వెళ్లగొట్టి అతని సింహాసనం ఆక్రమించు కోవాల్సిందిగా వృత్రాసురుని కోరాడు. వృత్రాసురుడు దేవలోకానికి వెళ్లాడు. వృత్రాసురునికి దేవతలకు భీకరంగా ప్రారంభమయింది. రాక్షసుడు దేవతలు ప్రయోగించిన ఆయుధాలన్నిటినీ మ్రింగి వేసి ఇంద్రుణ్ణి తరిమి కొట్టాడు.

ఇంద్రుడు బ్రహ్మ వద్దకు వెళ్లి తనను కాపాడమని ప్రార్థించాడు. "దధీచి ఎముకలతో తయారు కాబడిన ఆయుధం మాత్రమే వృత్రాసురుణ్ణి సంహరించకలదని, కాబట్టి, ఆయనను ఆశ్రయించు" అని బ్రహ్మ ఇంద్రునితో చెప్పాడు.

ఇంద్రుడు దధీచిని సమీపించి "ఓ మహర్షీ! నా తప్పిదానికి క్షమించి నన్ను ఆశీర్వదించండి" అని ప్రార్థించాడు.

"తన స్థానం సుస్థిర పరచుకోటానికి ఇంద్రుడు నా ప్రాణాన్ని అడుగబోతున్నాడు. ఈ శరీరం ఎప్పుడో ఒకరోజు పోయేదే! అందుకని ఒక మంచిపనికోసం – దేవతలను, ఇంద్రుని రక్షించి అసురసంహారం కోసం నా శరీరం వదలి వేస్తాను" అని దధీచి తలపోశాడా. ఆయన ఇంద్రునితో "లోగడ నాశిరస్సు ఖండించ తలచావు. ఇపుడు నా ఎముకలు కావాలంటున్నావు. అలాగే తీసికో" అని పలికి శరీరం విడిచి పెట్టాడు. అడవి జంతువులు ఆయన శరీరాన్ని భుజించి ఎముకల్ని మిగిల్చాయి. ఇంద్రుడు దధీచికి చెందిన ఎముకలను తీసికొని దేవతల ప్రధానశిల్పి విశ్వకర్మకు ఇచ్చి వజ్రాయుధాన్ని తయారు చేయమన్నాడు.

ఆ వజ్రాయుధంతో ఇంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించాడు. దధీచి తన శత్రువైన ఇంద్రుని క్షేమంకోసం తన శరీరాన్నే త్యాగం చేసిన మహాదాతగా ప్రసిద్ధుడైనాడు.

## 30. శ్రీకృష్ణునికి తీపి తినుబండారం

యమునా నదీ తీరాన శ్రీకృష్ణ భగవానుడు తన స్నేహితులతో ఆటలాడుకొనేవాడు. ఆయన మిత్రులు తెచ్చిన ఫలహారాలన్నీ అందరికి పంచి పెట్టేవాడు.

సాంధ్య కుమారుడు మధుమంగ యశోద అతనికి అన్నం పెడుతుండేది. ఒకసారి శ్రీకృష్ణుడు మిత్రునితో "మధూ! నీవు తప్ప అందరూ మిత్రులు తినటానికి ఏదో ఒకటి నా కోసం తెస్తారు. నీవు కూడా ఈ రోజు ఏదోఒకటి తీసికొని రా! మరచిపోకు" అన్నాడు.

మధుమంగా తల్లితో ఈ విషయం చెప్పాడు.

"నాయనా! మధూ! నాన్నగారు దేవతార్చన అయినదాకా మనం తినటం కుదరదు. కొంత చప్పని పెరుగువుంది. దానిలో కొంత చక్కెర కలుపుతాను అవి తీసికొని కృష్ణునికి ఇచ్చివేయి" అన్నది తల్లి.

మధుమంగ తల్లి ఇచ్చిన పెరుగు తీసుకొని బయలుదేరాడు. త్రోవలో "ఈ చప్పిడి పెరుగు శ్రీకృష్ణునికి ఎలా ఇస్తాం. అందరూ మంచిమంచి మధురమయినవి తెస్తుంటే, నేను ఈ చప్పిడి పెరుగు నేనే తినేస్తాను.

ఆ విధంగా అనుకొన్న మంగా ఒక చెట్టుచాటుకు పోయి తినడం ప్రారంభించాడు. చెట్టు కొమ్మ మీద కూర్చొని కృష్ణుడు ఇదంతా ఒక కంటకని పెడుతున్నాడు. ఆయన చెట్టుమీద నుండి క్రిందికి దూకి "మధూ! ఈ పెరుగునేమో అమ్మ నా కోసం పంపింది గదా! మరి నీవు తింటున్నా మేమిటిరా" అన్నాడు కృష్ణుడు. మధు దగ్గరకు వచ్చే సరికి అతడు పెరుగు మొత్తం జుర్రుకున్నాడు.

కానీ, శ్రీకృష్ణుడు మధుమంగ పెదవులునాకి "ఆహా! అద్భుతం! ఇది అమృతంగా వుంది. ఎంత బాగుంది! అన్నాడు.

ఇతర మిత్రులు ఆనందంతో కేరింతలు కొట్టారు. కృష్ణుణ్ణి వారంతా చేరి ఇలా స్తుతించారు.

"ఓ కృష్ణా! ఓ భగవన్! నీవు నీ భక్తుల పాలిటి బానిసవు. భక్తితో ఎవరుఏమి ఇచ్చినా ఆనందంగా స్వీకరిస్తావు."

## 31. మహాజ్ఞాని శుకమహర్షి

మహాభారతం ఇతర పురాణాలు రచించిన మహర్షి వేదవ్యాసుని కుమారుడే శుకుడు.

శుకదేవుడు గొప్ప జ్ఞాని. మహోన్నతుడు. తండ్రి ఆయనకు సకల విద్యలు నేర్పాడు.

ఒకరోజు శుకదేవునితో తండ్రి "బిడ్డా! నాకు తెలిసినదంతా నీకు నేర్పాను. ఇప్పుడు మిథిలానగర చక్రవర్తి జనకుని చెంతకు నిన్ను పంపుతున్నాను" అన్నాడు. శుకుడు "నాయనా! నన్ను జనకుని వద్దకు ఏ పని మీద పంపుతున్నావు" అని అడిగాడు.

ఎందుకంటే "ఆయన బ్రహ్మజ్ఞానం నేర్పుతాడు కాబట్టి," అని వ్యాసుడన్నాడు.

జనక చక్రవర్తి గొప్ప రాజర్షి. విశాల సామ్రాజ్యాన్ని పాలిస్తూ కూడా ఆయన లౌకిక ప్రాపంచిక విషయాలు పట్టించుకునేవాడు కాదు. తపశ్శక్తి ద్వారా శుకుడు తన వద్దకు వస్తున్నట్లు జనకుడు గ్రహించాడు. ఆయన తన సైనికులతో "శుకదేవుడు ఇక్కడికి వస్తున్నాడు. అతనికి ఎవ్వరూ స్వాగతం పలుకవద్దు. ఎలాంటి మర్యాద పాటించనక్కరలేదు" అని ఆజ్ఞాపించాడు.

అందరూ జనక చక్రవర్తి ఉత్తర్వుల పట్ల ఆశ్చర్యపోయారు. శుకదేవుడు రాజమందిరానికి విచ్చేశాడు. ఎవ్వరూ ఆయనకు స్వాగతం పలుకలేదు. ఎవరూ ఆయనకు కనీసం పలుకరించనైనా లేదు. మూడు రోజులపాటు నిశ్శబ్దంగా ద్వారం దగ్గిర శుకుడు కూర్చున్నాడు. నాల్గవ రోజు మంత్రులతో సహా జనకచక్రవర్తి వచ్చి శుకునికి ఆహ్వానం పలికాడు. గొప్ప మహర్షి మాదిరిగా ఆయన గౌరవింపబడ్డాడు. చాలా కాలం గడిచింది.

తనను ఎవరూ పట్టించుకోనప్పుడు గానీ, గొప్పగా సన్మానించినప్పుడు గాని శుకుడు ఎలాంటి భావం పొందలేదు. పదవ రోజున ఆయనకు గౌరవ పురస్సరంగా నాట్య సంగీత ప్రదర్శన ఏర్పాటు చేయబడింది.

ప్రదర్శన సగంలో ఉండగా జనకచక్రవర్తి ఒక పాత్ర నిండుగా పాలు పోసి శుకుని చేతికి ఇచ్చాడు. "బాలకా! శుకదేవా! నీవు ఈ పాత్రనుండి ఒక బొట్టు చిందకుండా ఏడుసార్లు ఈ ప్రాంగణం చుట్టూ ప్రదక్షిణం చేయాలి" అని కోరాడు.

అది శుకమహర్షికి ఏమంత కష్టమయిన పనికాదు. ఆయన బాలుడైనప్పటికీ మహాజ్ఞాని. సంగీతంకానీ, నాట్యంగానీ ఆయన మనస్సును చెదరనీయలేవు. ఆయనకు అప్పగించిన పని అవలీలగా నెరవేర్చాడు శుకదేవుడు. పాలు చిందకుండా పాత్రను తిరిగి జనకునికి అప్పజెప్పాడు.

జనకుడు ఆనందించాడు. శుకదేవునితో "నా బిడ్డా! నేను పెట్టిన పరీక్షల్లో నీవు నెగ్గావు. ఇప్పటికే నీవు బ్రహ్మ జ్ఞానివని నిరూపించావు. నేను నీకు నేర్పవలసింది ఏమీలేదు. **ప్రాపంచిక ఆకర్షణలకు తొలగి ఉండగల శక్తియే బ్రహ్మజ్ఞానం. నీకు ఇదివరకే అది ప్రాప్తించింది.** శుకదేవుడు తండ్రి చెంతకు ఆనందంతో తిరిగి వెళ్లాడు.

## 32. భక్త అంబరీష

మహాభక్తుడైన అంబరీషమహారాజు ఏకాదశి ఉపవాస దీక్ష చేస్తున్నాడు. మర్నాడు ఉదయం సూర్యోదయం కాగానే ఉపవాసం విరమించాలి.

అంబరీషుడు ఇక ఉపవాసదీక్షా విరమణ చేస్తాడనగా దుర్వాసమహర్షి అక్కడికి విచ్చేశాడు. అంబరీషుడు ఆయనకు ఘనస్వాగతం పలికి తనతో పాటు భుజించమని కోరాడు. మహర్షి అంగీకరించి" నేనిప్పుడే యమునా నదికి వెళ్లి స్నానం చేసి త్వరగా వచ్చేస్తానని" చెప్పాడు.

మహర్షి తిరిగి రావడానికి చాల సమయం పట్టింది. శాస్త్ర ప్రకారం దీక్ష సకాలంలో విరమించాల్సి వుంది. ముఖ్య పురోహితుని సలహామేరకు ఉద్ధరిణి జలాన్ని ప్రాశన చేశాడు.

రావడంతోనే దుర్వాసమహర్షి రాజు తనకోసం వేచివుండకుండా జలప్రాశన చేశాడని గ్రహించి ఆయన స్వభావానుగుణంగా కోపంతో ఊగిపోయాడు.

తన తపశ్శక్తితో ఒక దుష్టశక్తిని సృష్టించి, రాజును సంహరించాల్సిందిగా దానిని నియమించాడు. అంబరీషుడు భగవంతుని తనను రక్షించమని ప్రార్థించాడు. శ్రీమహావిష్ణువు సుదర్శన చక్రం పంపి దుష్టశక్తిని సంహరించాడు. ఆ చక్రం తర్వాత దుర్వాసుని వెంటబడి తరుమ సాగింది.

భయపడిన దుర్వాసుడు బ్రహ్మను, ఇంద్రుణ్ణి, మహాశివుణ్ణి ఆశ్రయించి తనను సుదర్శన చక్రం బారినుండి కాపాడమని ప్రార్థించాడు. దేవతలందరూ ఒకే మాటగా ఇలా చెప్పారు.

"మేము మా భక్తుడైన అంబరీషుణ్ణి గౌరవిస్తాం!

మేము నీకు ఎలాంటి సాయం చేయలేము"

చివరగా దుర్వాసుడు వైకుంఠానికి వెళ్లి శ్రీమహావిష్ణువుతో తాము పంపిన సుదర్శనచక్రాన్ని ఉపసంహరింపమని ప్రార్థిస్తూ.

"తానూ విష్ణుభక్తుణ్ణే ననీ, అయితే మీరు అంబరీషుని పట్ల పక్షపాతం వహిస్తున్నారు అని శ్రీమహావిష్ణువుని నిలదీశాడు.

శ్రీమహావిష్ణువు "నిజమే! నేను మీ ఇద్దరినీ రక్షించాల్సిన వాణ్ణే! కానీ అంబరీషుడు తనను తాను రక్షించుకొనే శక్తి కలిగి ఉండి కూడా నన్ను శరణువేడాడు" అన్నాడు.

దుర్వాసుడు తిరిగి శ్రీమహావిష్ణువుతో "ఓ దయాళూ! దీనికి మార్గం ఏమిటి? అని వేడుకున్నాడు.

శ్రీమహావిష్ణువు "నీవు పోయి అంబరీషుని శరణు వేడుకో, అదొక్కటే మార్గమని" సూచించాడు.

దుర్వాసుడు అంబరీషునికి మోకరిల్లి ప్రార్థించాడు. తక్షణం సుదర్శన చక్రం శ్రీమహావిష్ణుని చేతిలోకి వచ్చేసింది.

## 33. సేనానవి వేషంలో భగవంతుడు

సేనానవి ఆస్థాన క్షురకుడు. ఆతడు మహావిష్ణు గొప్ప భక్తుడు. ప్రతిదినం అతడు రాజ ప్రాసాదానికి వెళ్లేముందు శ్రీమహావిష్ణువును ప్రార్థించేవాడు.

ఒకనాటి ఉదయం పూజలో నిమగ్నుడై సమయం దాటిపోవడం అతడు గుర్తించలేదు. ఆతని భార్య, రాజుగారి కోపానికి తన భర్తగురి కాగలదని భయపడసాగింది.

ఇంతలో రాజప్రాసాదం నుండి సేవకుడు రానే వచ్చాడు. సేనానవి భార్య "అయ్యా! ఆయనపూజలో ఉన్నాడు. పూజ ముగిసిన వెంటనే వస్తాడు"

అని సేవకునితో అన్నది. కానీ, సేవకుడు "అమ్మా రాజు గారు అతనిని తక్షణం తీసుకొని రమ్మని ఆజ్ఞ విధించాడు అని తెలిపాడు.

సేనానవి భార్య "క్షమించండి! నేను ఆతనిని కదలించలేను" అని బదులు చెప్పింది.

సేవకుడు రాజు సన్నిధిలో, "రాజుగారి ఆజ్ఞపాటింప బడలేదు" అని మనవి చేశాడు.

రాజు మిక్కిలి కోపంతో ఒక సైనికుణ్ణి పంపి "అతణ్ణి బంధించి తీసికొనిరండి" అని అరిచాడు.

సైనికుడు బయలు దేరే సమయానికి సేనానవి తన సంచితో రావడం జరిగింది. సైనికుడు ఆతణ్ణి బంధించి రాజు సన్నిధికి తీసికొని వచ్చాడు.

రాజు అతణ్ణి బంధవిముక్తుణ్ణి చేయించి సేనానవితో తాను క్షౌరం, మర్దన చేయించుకున్నారు. రాజుగారికి అపూర్వమైన ఆనందం కలిగింది. ఆయన దృష్టి మర్దనకు ఉపయోగించిన నూనె సీసాపై పడింది. సేనానవి ప్రతిబింబం బదులుగా మహావిష్ణువు ప్రతి బింబం మంగలివాడు పనిచేస్తున్న కత్తిలో కన్పించింది. రాజుగారు సేనానవిని ఇలా అడిగాడు. "సేనానవీ! నీపట్ల నాకు చాల ఇష్టం ఏర్పడింది. నీవు రాజప్రాసాదంలోనే ఉండి పోకూడదా" అని అడిగాడు. క్షురకుడు రాజుగారి సూచనను సున్నితంగా తిరస్కరిస్తూ "మహారాజా! నేను ఇక్కడే నిలిచిపోతే ఇతరచోట్ల నా పని నిలిచిపోతుంది. నేను ఎలాగు మీరు ఎప్పుడు రమ్మనికోరితే అప్పుడు రావలసిన వాణ్ణే కదా" అన్నాడు.

రాజు అతనికి ఒక సంచి నిండా బంగారు నాణేలు నింపి ఇచ్చి తాను స్నానం చేసివచ్చే దాకా అక్కడే ఉండమని ఆదేశించాడు. సైనికుని వెంట వచ్చి రాజుగారికి క్షురకర్మ చేసింది సేనానవి రూపంలో విచ్చేసిన శ్రీమహావిష్ణువు. భక్తరక్షణకై అలా చేశాడు.

ఇంటివద్ద అసలు సేనానవి గాఢ ధ్యానంలో ఉన్నాడు. శ్రీమహావిష్ణువు రహస్యంగా వచ్చి బంగారు నాణేల సంచిని సేనానవి ఇంటి దగ్గర వదలి వెళ్లాడు.

రాజు స్నానం చేసిరాగా అక్కడ సేనానవి లేకుండటం గమనించాడు. రాజ తిరిగి సేనానవి ఇంటికి ఒక సైనికుణ్ణి పంపి అతని తీసికొని రమ్మన్నాడు.

సేనానవి భార్య సైనికుడు మరలా వచ్చాడనీ తక్షణం బయలుదేరమని తన భర్తను హెచ్చరించింది. సేనానవి రాజప్రాసాదానికి వడివడిగా వచ్చాడు. రాజుగారు పరుగుపరుగున ఎదురువచ్చి అతణ్ణి ఆలింగనం చేసికున్నాడు.

రాజు వానితో ''నేను స్నానం చేసి వచ్చేందాకా నిన్ను ఉండమన్నానుగదా! ఎందుకు వెళ్లిపోయావు? నేను నీ నూనె సీసాలో మరోసారి మహావిష్ణువు ప్రతిబింబం చూడాలనుకున్నాను" అన్నాడు.

సేనానవికి ఇదంతా అర్థం కాలేదు. అతడు "ఓ మహారాజా! నేను ఇప్పుడే మీ సముఖానికి వస్తున్నాను. ఇంతవరకు నేను ఇంటిలో ధ్యానంలోనే ఉన్నాను" అన్నాడు. రాజు ఆశ్చర్యపోతూ అయితే నాకు క్షురకర్మ, మర్దన చేసినది ఎవరు? అని ప్రశ్నించాడు.

సేనానవి గుర్తించాడు. శ్రీమహావిష్ణువే తన రూపంలో ఇదంతా చేశాడని. అతడు రాజుగారితో "మీరు నాకంటె మిక్కిలి అదృష్టవంతులు మీకు భగవంతుని దర్శనం లభించింది. ఆయన సేవలు అందుకున్నారు. భగవంతుడు ఎల్లవేళలా తన భక్తులను రక్షిస్తుంటాడు.

## 34. కావడి కథ

శివగిరి, శక్తిగిరి రెండూ హిమాలయ శిఖరాలు తన ఆవాసభూమి అయిన దక్షిణ భారతానికి వాటిని తరలించాలని అగస్త్యమహర్షి భావించాడు. మురుగన్ దేవుడు ఇచ్చిన శక్తిని ఉపయోగించి ఆ పర్వతాలను తరలిస్తున్నాడు.

త్రోవలో విశ్రాంతికోసం తిరుకేదారం అనే చోట పర్వతాలను నిలిపాడు. మురుగన్ అనుగ్రహం కోసం ఇడుంబాసురుడనేవాడు ఆ వైపు వస్తూ అగస్త్యమునికి ఎదురై "మహామునీ! నేను మురుగదేవుని సేవలో కొంతకాలం గడపదలిచాను నన్ను ఆశీర్వదించండి" అని కోరాడు.

"ఈ పర్వత శిఖరాలను నా ఆవాసం వద్దకు మోసుకొనిరా. మురుగదేవుని అనుగ్రహం నీకు కలుగుతుంది" అన్నాడు అగస్త్యముని.

ఇడుంబాసురుడు సంతోషంతో అంగీకరించాడు. కానీ, రాక్షసుడు పర్వతాలను ఎత్తాలనే ప్రయత్నంలో ఒక అడుగు ముందుకు వేయలేక పోయాడు. అంతకు ముందు అగస్త్యుడు వాటిని సులువుగా మోశాడు. రాక్షసుడు "ఓ మునీ! నేనింతకుముందు ఇంతకంటె పెద్ద పర్వతాలను ఎత్త గలిగాను. ఇప్పుడు ఈ కొండ శిఖరాలను కదలించలేకపోతున్నాను. నీ ఆవాసానికి వీటిని కొనిపోయే నాకు శక్తి ప్రసాదించండి" అని కోరాడు.

మురుగదేవుని ప్రార్థించాల్సిందిగా అగస్త్యుడు వానికి సలహా ఇచ్చాడు. ముని చెప్పిన విధంగా రాక్షసుడు మురుగదేవుని ప్రార్థించాడు.

వెంటనే ఎనిమిది సర్పాలు కన్పించి తాళ్లుగా మారాయి. అక్కడి బ్రహ్మాండం ఒక పొడవుపాటి దూలంగా మారింది. అగస్త్యుడు ఇడుంబాసురునితో "నాలుగు తాళ్లు ఈ దూలానికి కట్టు. తాడు అవతలికొస కొండకుకట్టు అని చెప్పాడు. అదొక కావడిలాగా తయారయింది ఇడుంబాసురుడు దానిని తన భుజాలపై పట్టుకున్నాడు. "నీవు దక్షిణం వైపుగా వెళ్లు తర్వాత నిన్ను నేను అనుసరిస్తాను అన్నాడు" అగస్త్యుడు.

రాక్షసుడు కావడి మోసుకుంటూ "తిరువావివాన్ కుడి" అనే ప్రదేశానికి చేరాడు. విశ్రాంతి కోసం పర్వతాలను నేలమీద దింపాల్సివచ్చింది.

కొంతసేపు విశ్రాంతి తీసికొని పర్వతాలున్నకావడిని ఎత్తడానికి ప్రయత్నించాడు రాక్షసుడు. కాని, అతడు అట్లా చేయలేకపోయాడు. అక్కడ

సమీపంలోని బిల్వ వృక్షం క్రింద వున్న బాలుడొకడు ఇడుంబాసురుని అశక్తతకు హేళనగా నవ్వుతున్నాడు. ఇడుంబాసురుని ఆ బాలుని కొట్టడానికి పరుగెత్తాడు. కాని, అతడే తడబడి బాలుని పాదాల చెంతపడి మరణించాడు.

ఇడుంబాసురుని మరణవార్త విన్న ఆతని భార్య పరుగెత్తు కుంటూ వచ్చి మురుగదేవుణ్ణి ప్రార్థించింది. "ఓ దయానిధీ! మిమ్ము గుర్తించజాలని అపరాధానికి నా భర్తను క్షమించి పునరుజ్జీవింప చేయాలని కోరింది.

బాలుడు నిజస్వరూప రూపంలో మురుగదేవునిగా దర్శనమిచ్చాడు. స్వామి రాక్షసునితో ''ఈ కొండలను ఇక్కడే వుండనీ! నీవు ఈ పర్వతపాదాలకు రక్షణగా ఉంటావు. నీవు భుజాలపై కావడిమోసిన విధంగా నా భక్తులు కూడా కావళ్లు మోస్తారు. అది నాకు సంతోషం కల్గిస్తుంది" అని ఆనతిచ్చాడు. ఈ నాటికీ ఆకొండలు అధిరోహించే భక్తులు పాదాల దగ్గర గల ఇడుంబాసురుని విగ్రహానికి మ్రొక్కుతూ ఉంటారు.

## 35. భాగవతం పరీక్షిన్మహారాజు

పాండవ సోదరులలో ఒకడైన అర్జునుని కుమారుడు అభిమన్యుడు. ఆతని కుమారుడు పరీక్షిత్తు.

ఒకనాడు పరీక్షిత్తు వేటనిమిత్తం అడవికిపోయాడు. చాలసేపు వేటాడంతో ఆయనకు దప్పిక అయింది. శమీకముని ఆశ్రమం లోనికి వెళ్లాడు. శమీకుడు తీవ్ర ధ్యానంలో ఉన్నాడు. పరీక్షిత్తు ఆయనను సమీపించి మంచినీరు కోరాడు. ఆయన తీవ్రధ్యానంలోవున్న కారణంగా ఎలాంటి సమాధానం లేదు. ఆ ముని తనను లక్ష్యపెట్టడం లేదని సమాధానం లేదు. ఆ ముని తనను లక్ష్య పెట్టడం లేదని చచ్చి పడివున్న పాము ఒకటి అతనికి కన్పించింది. దానిని తీసుకొని ఒక బాణం ద్వారా శమీకుని మెడలో వేసి తనదారిన తాను వెళ్లిపోయాడు.

కొంత సేపటికి శమీకుని కుమారుడు శృంగి ఆశ్రమానికి వచ్చాడు. ధ్యానం చేసుకుంటున్న తన తండ్రి మెడలో చనిపోయిన పాము ఉండటం గమనించాడు. కోపంతో మండిపడి శపించాడు. "ఏడు దినాలలోపల ఈ అకృత్యాన్ని జరిపిన వ్యక్తి పన్నగ రాజైన తక్షకుని కాటుచే నిహతుడగుగాక అన్నది శాపం.

ముని ధ్యానంనుండి లేచి తన కుమారుడు ఇచ్చిన శాపాన్ని గూర్చి తెలిసికున్నాడు. తపశ్శక్తి ద్వారా శ్రీకృష్ణభగవానులు భక్తుడైన పరీక్షిత్తుడనే ఆదేశపురాజే శాపగ్రస్తుడని గ్రహించాడు.

పరీక్షిత్తుకు ఈ శాపం గూర్చి తెలుపబడింది. అతడు మిక్కిలి విచారించి తాను చేసిన పనికి బాధపడ్డాడు. అతడు శ్రీకృష్ణుని ఇలా ప్రార్థించాడు "ఓ భగవానుడా! నేని"కా జీవించేది ఏడుదినాలే! నాకు మోక్షం ప్రసాదించు. అతడు తన కుమారుడు జనమేజయుణ్ణి రాజుగా నియమించి పవిత్ర గంగానది తీరానికి చేరుకున్నాడు. శుకమహామునితో సహ ఎందరో మునులు ఆయన వద్దకు చేరారు. శుకముని ఇలా చెప్పాడు "ఓ రాజా! పరమాత్ముని నామస్మరణే నీకు శాంతి చేకూర్చి చివరిగా ముక్తినిస్తుంది.

భగవంతుని ప్రశస్త అవతారాలు తెలిపే భాగవతాన్ని నీకు, ఇక్కడ ఉన్న మునులకు వినిపిస్తాను ఈ ఏడు దినాలు దానిని శ్రద్ధతో విను.

శుకముని తన తండ్రి వేదవ్యాసుడు రచించిన మహాభాగవతాన్ని వారికి వినిపించాడు. పన్నగరాజు తక్షకుడు తనను సమీపకుండా ఉండేటట్లు ఎన్నో రక్షణచర్యలు తీసుకొన్నాడు పరీక్షిత్తు,

ఇంత చేసినా ఒక పండులో పురుగుగా ప్రవేశించి రాజు ప్రాణాలు హరించాడు తక్షకుడు. ముని శాపం వృథాకాలేదు. కానీ, వేదవ్యాసుడు రచించిన మహాభాగవతాన్ని ఆయన కుమారుడు శుకమునిద్వారా భగవల్లీలలు విన్న పరీక్షిత్తుకు కడపటి దినాలు ప్రశాంతంగా గడిచాయి.

## 36. మహా శివభక్తుడు - మార్కండేయుడు

మరుద్వతీమృకండులు పవిత్ర దంపతులు. వారు శివభక్తులు. వారొక అడవిలో కుటీరంలో నివసిస్తుండేవారు. వారికి సంతతి లేదు.

వారు వారణాశి యాత్రకు వెళ్లారు. కాశీ విశ్వనాథుని, అమ్మ విశాలాక్షిని సేవించి గుడి ప్రక్కనే నివాసముంటూ తపస్సు చేయసాగారు. మహాశివుడు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మనినాడు. దంపతులు మగబిడ్డ కావలెనని కోరారు. మహాదేవుడు "మీకు నూరు సంవత్సరాలు ఆయుర్దాయం కల అయోగ్యుడైన కుమారుడు కావాలా, పదునొకండు సంవత్సరాల ఆయుర్దామం కలిగిన సదాచారుడు, నా భక్తాగ్రేసరుడు కావాలా కోరుకొమ్మనాడు.

మాకు, మీ భక్తుడుగా వుండి సద్బుద్ధికల వాడే కావాలని దంపతులు కోరారు. మహాశివుడు 'తథాస్తు' అని ఆశ్వీరదించి అంతర్ధానమయినాడు.

మహాశివుని వరప్రసాదంతో జన్మించిన తమ బాలునికి ఆ దంపతులు "మార్కండేయుడు" అని నామకరణం చేశారు.

మార్కండేయుడు పవిత్ర భావనలతో, చక్కని నడవడిగల శివుని మహాభక్తుడుగా రూపొందాడు. అతడు వేదవేదాంగాలు నేర్చాడు.

అతనికి పదునారవ ఏడు సమీపిస్తున్నది. తల్లిదండ్రులు లోలోన మిక్కిలి అదుర్దా చెందుతున్నారు. తన బిడ్డకు అంత్యకాలం సమీపిస్తున్నదే అని వారి చింత.

తాము ఎందుకంత విచారంగా మసలుతున్నారో తెలుపమని తల్లిదండ్రులను మార్కండేయుడు అడిగాడు.

వారు తమకు మహాశివుడు ఇచ్చిన వరాన్ని గూర్చి వివరంగా తెలిపారు.

మార్కండేయుడు తల్లిదండ్రులతో "మీరేమి చింతించవద్దు. నేను మహాశివుని అనుగ్రహంతో మృత్యుదేవత అయిన యమధర్మరాజును నిర్జిస్తాను. నన్ను ఆశీర్వదించండి" అని అన్నాడు.

మార్కండేయుడు తల్లిదండ్రుల ఆశీర్వాదంపొంది వారణాసి వెళ్లి విశ్వనాథుణ్ణి భక్తి శ్రద్ధలతో అర్చించసాగాడు. విశ్వనాథుడు ప్రత్యక్షమై "వత్సా! నీవు యమధర్మరాజుకు కూడా భయపడ పనిలేదు. నా పూజకొన సాగించు. నన్ను విడువకు" అని ఆశీర్వదించాడు.

పదునారేండ్లు పూర్తి కాగానే యముని దూతలు వారణాసి వచ్చి మార్కండేయుని కొని పోవటానికి సిద్ధమయినారు. కానీ, ఆతని శరీరాన్ని సమీపించలేకపోయారు. యమపురికి వెళ్లి యమధర్మరాజుతో "ఓ దొరా! మేము మార్కండేయుని సమీపించే సరికి మాకు గట్టి దెబ్బలు తగిలాయి" అని చెప్పారు.

యమధర్మ రాజ స్వయంగా మార్కండేయుని ప్రాణాలు హరించడానికి బయలు దేరాడు. మార్కండేయుడు శివలింగాన్ని గట్టిగా పట్టుకొని **'ఓం నమశ్శివాయ'** మంత్రాన్ని జపిస్తూ ఉన్నాడు. యమధర్మరాజు రాకతో మహాశివుడు శివలింగం వెలికి వచ్చి "ఓ యముడా! నీవు నా భక్తుల దరిచేరరాకు. ఈ మానవుడు నా శిష్యుడు" పూర్తి నూరుఏండ్లు జీవితం గడపనీ! అని హెచ్చరించాడు.

యమధర్మరాజు తిరిగి వెళ్లిపోయాడు. శివానుగ్రహం పరిపూర్ణంగా పొందిన మార్కండేయుడు తల్లిదండ్రుల వద్దకు తిరిగి వెళ్లాడు. జరిగిన విషయమంతా వారికి విశదపరిచాడు. అంకిత భక్తిభావంతో భగవంతుని సేవించిన వాని విధికూడా మార్పు జెందుతుంది.

ఆ విధంగ మార్కండేయుడు శతాయుష్కుడయ్యాడు.

## 37. వాల్మీకి రామాయణం

వాల్మీకి గొప్ప ఆధ్యాత్మిక శక్తిగల ఋషి. అరణ్యంలోని ఋషులెందరూ ఆయనను మిక్కిలి గౌరవిస్తారు.

ఒకనాడు నారదముని వాల్మీకి ఆశ్రమానికి విచ్చేశాడు. పరస్పరం కుశలం తెలిసికొన్న తర్వాత వాల్మీకి నారదుణ్ణి ఇలా ప్రశ్నించాడు. "ఓ మహర్షీ! నీవు లోకం అంతాచుట్టి వస్తుంటారు గదా! ఔదార్యంలోను నడవడిలో అత్యుత్తముడు ఎవరు? నారదుడు జవాబిస్తూ" అయోధ్యకు రాజైన దశరథుని కుమారుడు శ్రీరామచంద్రమూర్తి అన్నాడు.

"నీవు ఆతణ్ణి వర్ణింపగలవా! వాల్మీకి తిరిగి నారదుణ్ణి ప్రశ్నించాడు.

నారదుడు శ్రీరాముని చరితాన్ని వాల్మీకికి సంపూర్ణంగా వినిపించాడు. వాల్మీకి అబ్బురపడి నారదునితో శ్రీరాముని జీవితం ఎంతటి మహత్తరమయింది? అని శ్లాఘించాడు.

ఒకరోజు వాల్మీకి మహర్షి స్నానం చేయటానికి తమసా నదికి వెళ్లాడు. శిష్యులు ఆయనను అనుసరించారు. చెట్టుమీద ఒక కొమ్మపై కూర్చున క్రౌంచపక్షుల జంటను వాల్మీకి చూచాడు.

ఇంతలో ఒక వేటగాని బాణం వేగంగా దూసుకొని వచ్చి మగపక్షిని హతమార్చింది. ఆడపక్షి మహాదుఃఖంతో రోదించింది. మరణించిన పక్షిని తీసికొని వెళ్లడానికి వేటగాడు అక్కడికి వచ్చాడు. వాల్మీకి వానితో ఓ **బోయవాడా! నీవు చేసిన ఈ దుర్మార్గానికి ఫలితం అనుభవిస్తావు. నీవు ఎక్కడకు పోయినా నిలువ నీడలేక నీ జీవితమంతా బాధపడతావు"** అని హెచ్చరించాడు.

వాల్మీకి నోటనుండి వెలువడిన వాక్కులు కరుణతోనూ, దుఃఖంతోనూ, శబ్దసౌందర్యంతో లాలిత్యంతో కూడినవై ఉన్నాయి. తీవ్రమయిన శోకంతో అనుకంపతోను సంస్కృతంలో వెలువడిన మొదటి శ్లోకం ఇదే!

అప్పుడే సృష్టికర్త అయిన బ్రహ్మావాల్మీకి ఆశ్రమానికి విచ్చేశాడు. బ్రహ్మదేవుడు వాల్మీకిని "నీవు మహాకవిగా ఖ్యాతి కెక్కుతావని ఆశీర్వదించాడు. వాల్మీకి బ్రహ్మదేవుని ఉద్దేశించి "ఓ మహానుభావా! నన్ను ఏ విషయాన్ని

గురించి రాయమని ఆజ్ఞ" అని ప్రశ్నించాడు. అంతట బ్రహ్మ "నీవు శ్రీరామునిగూర్చి నారదునిద్వారా తెలుసుకున్నావుగదా! ఆయన చరితనే కావ్యంగా రచించు" అని ఆనతిచ్చాడు. బ్రహ్మదేవుడు వెళ్లిపోయిన తర్వాత వాల్మీకి తీవ్రధ్యానంలోనికి వెళ్లాడు.

శ్రీరామచంద్రుని జీవితమంతా వివరంగా ఆయనకు కళ్లకు కట్టినట్లయినది.

వాల్మీకి మహర్షి మహాకావ్యమయిన రామాయణం రచించడానికి ఉపక్రమించారు. క్రౌంచ పక్షులను చూచినపుడే అనుష్టుప్ ఛందస్సులో శ్లోకం వెలువడింది. వాల్మీకి రామాయణ మంతటినీ 24 వేల శ్లోకాలతో అదే ఛందస్సులో రచించాడు. ఈ భూమిపై నదులు కొండలు ఉన్నంతకాలం. ఈ రామాయణ మహాకావ్యం ఆ చంద్రతారార్కం ఈ భూమిపై నిలిచే ఉంటుంది.

## 38. శ్రీరాముని అశ్వమేధ యాగం

లంకాధిపతి రావణసంహారం అనంతరం అయోధ్య చేరిన దశరథరాముడు అశ్వమేధయాగం తలపెట్టాడు.

బలులు ఇచ్చిన వెంటనే శ్రీరాముడు యాగాశ్వాన్ని పూజించాడు. శ్రీరాముడు ఆ అశ్వాన్ని తాకగానే అది మానవాకారం దాల్చింది. తన కథ ఇలా చెప్పసాగింది "ఓ రాజా! గత జన్మలో నేనొక బ్రాహ్మణ్ణి. మీ అనుగ్రహంతో నేను అనేక ధర్మకార్యాలు చేసి పుణ్యం సంపాదించుకున్నాను. నేను చాల ప్రసిద్ధిగాంచాను. ఆ ఖ్యాతి నాలో గర్వాన్ని పెంచింది. నేను అహంభావాన్ని చాటుకోవడానికి గొప్ప యజ్ఞం తలపెట్టాను. అది సద్బుద్ధితో చేసింది కాకుండా మరింతపేరు ప్రఖ్యాతులకోసం తల పెట్టబడింది.

నేను ఆ యాగం చేస్తుండగా దుర్వాసమహర్షి అక్కడికి విచ్చేశాడు. ఒక సేవకుడు వచ్చి ఆయన రాకను నాకు తెలిపాడు. కానీ, నేను

గర్వమదంతో "ఆయన వస్తే రానీ, నేను యాగం చేస్తున్నాను. ఆయన నాకంటే అధికుడేమి కాదు" అన్నాను.

సహజ కోపిష్ఠి అయిన దుర్వాసుడు తన స్థాయికి తగిన విధంగా ఆహ్వానింపబడలేదని మండిపడ్డాడు. వెంటనే శాపం పెట్టూ "నీవు దానధర్మాలు చేస్తూ గొప్పవాడివని గర్వపడుతూ ఉన్నావు. నీవు నన్ను అగౌరవపరిచావు. ఈ పాపానికి నీవు అశ్వంగా మారిపోతావు" అని అన్నాడు.

నేను భయపడుతూ ఆయన పాదాలపై బడి "ఓ మునీశ్వరా! గర్వంతో నేను అంధుణ్ణి అయినాను. దయ తలచినన్ను క్షమించండి" అని ప్రార్థించాను. అందుమీదట దుర్వాసుడు "నా శాపం నేను మరల్చలేను శ్రీరామ భక్తుడవయిన నీవు ఆయన కరస్పర్శతో తిరిగి మానవ శరీరం పొందగలవు" అని తెలిపాడు.

శ్రీరామచంద్ర ప్రభునిపట్ల భక్తి ఆయనకు తిరిగి మానవ జన్మ లభించడాని కారణమయింది.

## 39. మహాకవి కంబరు

చోళమండలంలోని తిరుముండూరులో నివసిస్తున్న ఆలయపూజారి ఉవ్వచ్చన్ చెంతకు ఒకనాడు ఒక గర్భిణీ స్త్రీ వచ్చింది. ఆమె పూజారితో "అయ్యా! మా స్వగ్రామం కంబం. మా ప్రాంతంలో చెలరేగిన దౌర్జన్య సంఘటన కారణంగా ప్రజలంతా ప్రాణభీతితో తలా ఒక దిక్కుకు పారిపోసాగారు. నేను కూడా పరుగెత్తాల్సి వచ్చింది. నేను గర్భవతిని. మీ ఇంట నాకు ఆశ్రయం కల్పించాలని ప్రార్థన" అని వేడుకొంది.

దయాళువైన పూజారి ఆమెతో "ఓ తల్లీ! నీ ఇష్టం వచ్చినంత కాలం నా ఇంట ఉండవచ్చు" అని ఆమెకు అభయమిచ్చాడు.

కొంత కాలానికి ఆమెకు ఒక మగబిడ్డ కలిగాడు. ఆమె కంబం నుండి వచ్చింది. కాబట్టి, బిడ్డకు కంబన అని పేరు పెట్టారు.

కంబన్‌కు ఏడవ ఏడువచ్చింది. సదాయప్ప అనే ఉదారుడు తల్లీబిడ్డలకు అండగా నిలిచాడు. కనక రాయ అనే గురువు దగ్గరకు కంబన్‌ను పంపారు. ఆనాడు దేవాలయాల్లో సంవత్సరోత్సవాలు జరుగుతున్నాయి. పూజా సామగ్రి సమకూర్చడంతో కంబన పూజారికి తోడ్పడుతున్నాడు.

అభిషేకం సమయం వచ్చింది. అమ్మవారిపై ఉన్న ఆభరణాలు తొలగించి అభిషేకానికి సిద్ధపరచమని కంబన్‌ను ఆదేశించారు.

అభిషేక సమయానికి కంబన్‌కు కొంత అస్వస్థత కల్గింది. దివ్య మాతను ప్రార్థించాడు. ఆమె అనుగ్రహం కంబన్‌కు పూర్ణంగా లభించింది. "నీవు ఒక మహాకవికాగలవని కూడా ఆ తల్లి దీవించింది.

ఒకనాడు కంబన్ తన ఆసామి పొలానికి కాపలా కాస్తూ ఉన్నాడు. ఎక్కడి నుండి వచ్చిందో ఒక గుర్రం పొలంలోనికి చొచ్చుకొని వచ్చింది. పైరును మేయసాగింది. గుర్రాని బయటకు తోలడానికి కంబన్ గట్టిగా కేకలు వేశాడు. ఆ పదాలు ఆతని నుండి కవితా రూపంలో ఇలా వెలువడినాయి. "దివ్యజననీ! కళింగరాయని అశ్వం పైరు మేస్తున్నది. దాని ప్రాణాలు తీయి" అంతే! తక్షణం గుర్రం నేలకూలింది.

గుర్రపు యజమాని విషయం విని సదాయప్పతో సహాపొలానికి వచ్చారు. గుర్రం చనిపోవటం గమనించి దిగ్భ్రమ చెందారు. కానీ వారికి నమ్మకం కలుగలేదు. కంబన్ దానిని రాళ్లతో మోది చంపివుంటాడని వారి భావన. కంబన్ "లేదయ్యలారా! నేను దానిని చంపలేదు. దాని మీద గట్టిగా అరచి కేకలు వేశాను. అది ఒక పద్యంగా రూపొందింది" అని సంజాయిషీ ఇచ్చారు.

వారు ఆలోచించారు.

"ఆ పద్యం దివ్యజనని కటాక్షమూలంగా వచ్చింది కాబోలు. గుర్రపు ఆసామి" అదే నిజమైతే పైరు ఖరీదు నేను చెల్లిస్తాను. కంబన్ మరొక పద్యం చదివి దానిని తిరిగి జీవింప చేయమనండి అని తన నిర్ణయం ప్రకటించాడు.

కంబన్ గుర్రాన్ని జీవింపజేయమనే పద్యం చెప్పి దివ్యజనని ప్రార్థించాడు.

ఆశ్చర్యం!

చనిపోయిన గుర్రం జీవించిలేచి నిలబడింది. ప్రతివారు కంబన్‌కు అమ్మవారి కటాక్షం ఉందని అంగీకరించారు.

కంబన్ తమిళభాషను క్షుణ్ణంగానేర్చి 'తిరుక్కురై' రాశాడు.

కంబన్ దీక్షతో వాల్మీకి రామాయణాన్ని పారాయణ చేయగా ఆ గ్రంథం ఆత్మని కుదిపివేసింది.

ఒకనాడు సదాయప్పకు ఒక దూతద్వారా ఒక లేఖవచ్చింది. అందులో కులోత్తుంగ చోళచక్రవర్తి కంబన్‌ను తన సన్నిధికి తోడ్కొని రమ్మని ఆదేశించాడు. దీనితో కంబన్ ప్రఖ్యాతి బహుధా వ్యాపించింది.

సదాయప్ప కంబన్‌ను రాజసభకు తోడుకొని వెళ్లాడు. కంబన్ కవితలను విన్న చక్రవర్తి ఆతనిని ఆస్థానకవిగా నియమించాడు. ఆస్థాన కవికి యోగ్యమైన వస్తువులన్నీ బహూకరించాడు.

ఒకనాడు చక్రవర్తి, కంబర్‌ను, మరొక ప్రముఖకవి ఒట్టకూత్తర్ పిలిచి "కవులారా! నాకు వాల్మీకి రామాయణం తమిళంలో రాస్తే చూడాలనివుంది. మీరు నా కోరిక నెరవేర్చాలి" అని అన్నాడు.

తానూ ప్రసిద్ధుడైనప్పటికీ చక్రవర్తి తనకంటె కంబకని ఎక్కువగా ప్రశస్తిస్తున్నందుకు ఒట్టకూత్తర్‌కు అతని పట్ల అసూయ ఏర్పడింది. తాను పెద్దవాణ్ణి అయినప్పటికీ చక్రవర్తి ఇద్దరిని సమానంగా చూస్తూ ఉండటం అతనికి చిన్నతనంగా తోచింది.

కొన్ని నెలల తరువాత కవులతో "మీ తమిళ రామాయణం ఎంత దాకా వచ్చింది? అని ప్రశ్నించాడు. ఒట్టకూతర్ " నేను కొద్దిగా మాత్రమే రాయగలిగాను అన్నాడు.

కంబకవి "మహారాజా! శ్రీరాముడు వానరసేనతో సముద్రలంఘన ఘట్టం వరకు రాశానని విన్నవించాడు. కంబన్ ఇంతవరకు రచన మొదలే పెట్టలేదని గ్రహించి ఒక సూచన చేశాడు "మీరు రచించిన పద్యభాగంలో చివరి పద్యాలను వివరించ వచ్చుకదా! అన్నాడు.

సరస్వతీదేవి అనుగ్రహంతో ఆ విధంగానే చేస్తానంటూ కంబకవి కొన్ని పద్యాలు అనర్గళంగా చదివాడు. చక్రవర్తి ఆశ్చర్యపోయాడు. "ఆహా! అద్భుతంగా ఉంది అని ప్రశంసించాడు. చక్రవర్తి కంబకవి ఇంతటి వరకూ ఎట్లాగూ రాశాడు గనుక ఆయనే గ్రంథాన్ని అంతా పూర్తిచేస్తే బాగుంటుంది అన్నాడు ఒట్టకూత్తర్.

కంబకవి అచిరకాలంలో వాల్మీకి రామాయణాన్ని తమిళంలోనికి అనువదించి చక్రవర్తికి ఆనందంకల్గించాడు. చక్రవర్తి ఈ విధంగా ప్రకటన వేయించాడు. "శ్రీరంగం దేవాలయ ప్రాంగణంలో పెద్దలు పండితుల సమక్షంలో ఈ రామాయణం పారాయణం జరగాలి. కంబకవి శ్రీరంగం ముందుగా వెళ్లాడు. అక్కడ శ్రీవైష్ణవాచార్యుడైన నాథమునిని కలిసి తాను వచ్చిన పని తెలిపాడు ఆచార్యులవారు కంబకవిని ఆశీర్వదిస్తూ "నీ రచనకు **రామావతారం**" అని నామకరణం చేయడం నాకు మిక్కిలి సంతోషం కలిగించింది. వైష్ణవ పండితుల సమక్షంలో వేయి కాళ్ల మండపంలో

దీనిపారాయణ జరగాలి" అలాగే జరిగింది. నాథముని ప్రశంసిస్తూ "తొలిపద్యమే ఒక రత్నం. సదాయప్ప నీకు ఎంతో ఉపకారం చేశాడు. కానీ ప్రతి నూరు పద్యాల కొకసారి నీవు కీర్తించడం సరికాదు. వేయి పద్యాలలో ఒకసారి అతనిని ప్రశంసించు అది చాలు" అని అన్నాడు.

చిదంబరంలో కంబ రామాయణపారాయణం జరుగుచుండగా ప్రధాన అర్చకుని కుమారుణ్ణి త్రాచుపాము కరచింది. కంబకవి రామావతారం నుండి "నాగపాశం" ఘట్టాన్ని చదివాడు. త్రాచు తిరిగి వచ్చి బాలుణ్ణి నాకి విషం హరించుకొని పోయింది. బాలుడు ఆరోగ్యవంతుడైనాడు. రామవతార మాహాత్మ్యం అంత గొప్పది. కంబకవి భక్తి మరీ గొప్పది.

## 40. రావణాసురుని ఓడించిన అగస్త్యుడు.

రావణాసురుడు లంకను పాలించే రాక్షసరాజు. ఒకనాడు అతనికి ఒక దుర్బుద్ధి కలిగింది. "నేను దేవతలను జయించాను. కానీ, నా దేశం ప్రక్కనే గల దక్షిణ భారతం నా అధీనంలోనికి రాలేదు. నేను దీనిని కూడ జయించి నా స్వాధీనంలోనికి తెచ్చుకోవాలి" ఇతని అతని బుర్రలో ప్రవేశించింది.

కొందరు వేగులను వెంట బెట్టుకొని దక్షిణ దేశాన్ని గూర్చి – దాని పై దాడిచేసే ముందు తెలుసుకోవాలని బయలుదేరాడు రావణాసురుడు.

దక్షిణభారతదేశంలో పొదిగై కొండలుగల ప్రాంతానికి చేరాడు. అదే అగస్త్యమహాముని నివాస భూమి. రావణాసురుడు ఆయనను దర్శించాడు. మునికి రావణుని దురాలోచన అర్థమయింది.

రావణుడు మునికి నమస్కరించాడు. మహామునీ! మీకు నా ప్రణామాలు" అన్నాడు. అగస్త్యముని కూడా సాదరంగా రావణునికి స్వాగతం పలుకుతూ "ఓ లంకేశ్వరా! ముప్ఫైలక్షల కోట్ల సంవత్సరాలు జీవించి వరాన్ని కూడా పొందినవాడా! లోనికి దయ చేయి" అని అన్నాడు.

అగస్త్యముని తిరిగి రావణునితో "మీరేమి పనిమీద ఇక్కడకు వచ్చారు? అని అడిగాడు. రావణుడు దాపరికంలేకుండా యధార్థం అగస్త్యునికి తెలిపాడు. ఇక్కడి పరిస్థితులను స్వయంగా పరిశీలించదలచానని కూడా చెప్పాడు.

అగస్త్యుడు రావణునితో "నీవు రుద్రవీణ వాయించటంలో గొప్ప ప్రతిభాశాలివి గదూ!" అన్నాడు.

రావణుడు ఆ మాట నిజమని అంగీకరించాడు. అంతటముని "అట్లాగయితే వీణావాదనం నాతో చేయి. నన్ను జయిస్తే నీ కోర్కె నెరవేరుతుంది" అన్నాడు. రావణాసురుడు అంగీకరించాడు.

ఈ పోటీ గురించి దేశమంతటా ప్రాకింది. దానిని చూడటానికి వేల సంఖ్యలో మహాజనం విచ్చేశారు. రావణాసురుడు ముందుగా అగస్త్యునే వీణవాదన ప్రారంభించమంటూ "మీరు వాయిస్తే ఆ మాధుర్యానికి నా హృదయం ఉప్పొంగుతుంది" అన్నాడు.

అగస్త్యుడు అన్నాడు "నా వాదనతో నీ హృదయం పరవశించిందని ఇతరులకు తెలిసేదెట్లా? అందుకని మనముందున్న పొదిగై కొండలు కన్నీరుతో కరిగేలా నా వీణను పలికిస్తాను.

అగస్త్యుడు వీణవాదన ప్రారంభించాడు.

ఓహో! ఆశ్చర్యం!

క్రమంగా కొండలు కరగడం ప్రారంభించాయి. రావణాసురుడు ఆశ్చర్యంలో మునిగిపోయాడు. అగస్త్యుని వలె తాను చేయజాలనని రావణాసురునికి తెలుసు.

తలవాల్చి కూర్చున్నాడు రావణుడు. తన తప్పు ఒప్పుకొంటూ "ఓ! మహామునీ! నేను నా ఓటమిని అంగీకరిస్తున్నాను. మీ అధీనంలోని ఈ ప్రదేశాన్ని జయించే సాహసం చేయను" అంటూ సెలవు తీసికొని లంకాపురికి తిరిగి వెళ్లాడు.

## 41. మహాపతివ్రత సుభద్ర

చిత్రరథుడనే గంధర్వుడు ఆకాశమార్గాన వెళ్తూ తాను నములుతున్న తాంబూలాన్ని ఉమ్మివేశాడు. ఆ సమయంలో అర్ఘ్యమిస్తున్న గాలవ్యముని దోసిలిలో అది పడింది. ముని కోపంతో ఉగ్రుడైనాడు. ఆయన పైకి చూసి గంధర్వుణ్ణి గమనించాడు. అతనిని శపించదలిచాడు. శపిస్తే తన ఆధ్యాత్మిక సంపద కోల్పోతానని భావించి శ్రీకృష్ణభగవానునితో ఈ దురాగతాన్ని తెలిపి శిక్షింపమని కోరదలచాడు.

ద్వారక వెళ్లిన గాలవ్యముని గంధర్వుని దురాగతాన్ని శ్రీకృష్ణునికి తెలియజేశాడు. "ఓ మునీశ్వరా! ఆవేశపడకు! రేపు సూర్యాస్తమయ సమయానికి నేనతణ్ణి సంహరిస్తానని శ్రీకృష్ణుడు అభయమిచ్చాడు.

నారదముని చిత్రసేనుని వద్దకు వెళ్లి నిన్ను రేపుసూర్యాస్తమయానికి వధించగలనని శ్రీకృష్ణుడు గాలవ్యమునికి వాగ్దానం చేశాడు అని తెలిపాడు.

చిత్రసేనుడు భయకంపితుడై "ఓ మహర్షీ! ఈ శిక్ష తప్పించుకునే మార్గం నాకేమీలేదా? అని ప్రశ్నించాడు. నారదమహర్షి అతణ్ణి ఇంద్రుణ్ణి, యముణ్ణి, బ్రహ్మను, మహాశివుని వేడుకోమని సూచించాడు.

చిత్రసేనుడు వారినందరినీ దర్శించాడు. శ్రీకృష్ణుడు స్వయంగా గాలవ్యమునికి మాట ఇచ్చాడు గనుక తాము ఎవ్వరమూ ఏలాంటి సాయం చేయలేమని చెప్పారు.

చిత్రసేనుడు తిరిగి నారదమహర్షి చెంత చేరాడు. నారదుడు అతనికి ఈ విధంగా సలహా ఇచ్చాడు. చిత్రసేనా! నిరాశ చెందకు! శ్రీకృష్ణుని సోదరి అర్జునుని భార్యఅయిన సుభద్ర యమునానదికి పవిత్ర స్నానానికి వస్తుంది. అప్పుడు నదీతీరాన ఎవరైనా ఆర్తితో ఉంటే అట్టివారిని ఆమె కాపాడుతుంది. అయితే వాగ్దానాన్ని పుచ్చుకొనేంత వరకు నీ దుఃఖకారణం ఆమెకు తెలుపవద్దు".

చిత్రసేనుడు నారదుని సూచనమేరకు యమునా నది ఒడ్డున చేరి రోదించసాగాడు.

పవిత్రస్నానానంతరం సుభద్ర రోదిస్తున్న చిత్రసేనుణ్ణి చూచింది "నన్ను రక్షించేవారే లేరా? లేకపోతే నేను ఈ నదిలో దూకి మరణిస్తాను" అంటూ చిత్రసేనుని కేకలు సుభద్ర విన్నది.

సుభద్ర అతణ్ణి సమీపించి అతనిని రోదిస్తున్న కారణం అడిగింది.

చిత్రసేనుడు "అమ్మా! నన్ను రక్షిస్తానంటే నా దుఃఖకారణం తెలుపుతాను" అని అన్నాడు.

"నేను నీకు వాగ్దానం చేస్తున్నాను. మహాశక్తిశాలి అయిన పాండవసోదరులలో ఒకరైన అర్జునుడు నా భర్త. శ్రీకృష్ణభగవానుడు నా సోదరుడు. నేను తప్పక నీ దుఃఖాన్ని తొలగిస్తాను" అంటూ సుభద్ర చిత్రసేనునికి అభయమిచ్చింది.

చిత్రసేనుడు తన దుఃఖకారణం సుభద్రకు తెలిపాడు. సుభద్ర "చింతించకు! నా భర్త అర్జునుడు నా వాగ్దానం నెరవేర్చటానికి నిన్ను తప్పక రక్షిస్తాడు" అంటూ ఇంటికి వెళ్లింది.

తాను చిత్రసేనునికి వాగ్దానం గూర్చి తన భర్త అర్జునునకు తెలిపింది.

అర్జునుడు సమ్మతించి అవసరమయితే శ్రీకృష్ణునినైనా ఎదిరించి చిత్రసేనుని కాపాడగలగని తెలిపాడు.

శ్రీకృష్ణుడు చిత్రసేనుని వధించడానికి, అర్జునుడు అతణ్ణి రక్షించటానికి, తమ తమ పట్టుదలల కారణంగా శ్రీకృష్ణార్జునుల మధ్య పోరు మొదలయింది. ఒక సమయంలో శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రాన్ని, అర్జునుడు తన పాశుపతాస్త్రాన్ని, ప్రయోగింపపూనారు. ఈ విషయం తెలిసికొన్న మహాశివుడు.

ఇరువురి మహావీరుల ఎదుటకు వచ్చి "శ్రీకృష్ణా! అర్జునుడు నీకు కూర్చు భక్తుడు. అతని వాగ్దానం నెరవేర్చుకునేందుకు నీవు సాయంచేయాలికదా" అన్నాడు.

మహాశివుని వాదనతో ఏకీభవించిన శ్రీకృష్ణుడు యుద్ధం విరమించాడు.

గాలవ్యముని వచ్చి ఇలా అన్నాడు. "నాపట్ల అపచారం చేసిన చిత్రసేనుని మీరు – శ్రీకృష్ణార్జునులు ఏకమై అతని పక్షం వహించారు. నేను తపశ్శక్తిని ఉపయోగించి అతణ్ణి భస్మం చేస్తాను" అని ప్రకటించాడు. కమండలం నుండి ఆతడు పవిత్రజలం మంత్రించి చిత్రసేనుని పై చిలకరించ దలిచాడు.

ఇంతలో సుభద్ర అకస్మాత్తుగా అక్కడకు వచ్చి "నేను గనుక మనస్సులో కూడా నా భర్తను తప్ప పరపురుషుని తాకని ఎడల చిత్రసేనుని మీద పవిత్రజలాలు పడకుండుగాక" అని శపథం చేసింది.

గాలవ్యముని చేతిలోని జలం అదృశ్యమయిపోయాయి. గాలవ్యముని పడిపోయాడు. మహాపతివ్రత శక్తి అట్టిది.

## 42. దుష్టరాక్షసులు - ఇల్వలుడు, వాతాపి

ఇల్వలుడు, వాతాపి అనీ రాక్షసులిద్దరు అన్నదమ్ములు. వారికి సాధుసన్యాసులపట్ల క్రోధం. వారి స్వాధీనంలో ఉండే దుష్టశక్తులతో తాపసులను మునులను చంపసాగారు.

వారు భక్తులుగా మానవరూపం ధరించి తాపసులను మునులను తమనివాసానికి విందుకు అహ్వానిస్తారు. ఇల్వలుడు తన తమ్ముడు వాతాపినే మేకగా మారుస్తాడు. తర్వాత ఆ మేకను చంపి మాంసంతో రకరకాల వంటకాలు చేసి అతిథికి వడ్డిస్తాడు.

అతిథి భోజనం ముగించినంతనే ఇల్వలుడు "తమ్ముడా! వాతాపి బయటకు రా! అని పిలుస్తాడు. అతిథి పొట్టలోవున్న వాతాపి పొట్ట చీల్చుకొని

బయటకు వచ్చి తిరిగి జీవించిన మేకగా మారతాడు. తమకు లభించిన దుష్టశక్తులతో వారీవిధంగా చేస్తూ వచ్చారు. తర్వాత మేక వాతాపిగా మారతాడు. అతిథి మరణిస్తాడు.

ఈ విధంగా వారు తాపసులను మునులను చాల మందిని చంపివేశారు.

ఒకసారి అగస్త్య మహాముని స్వయంగా ఈ ఇద్దరి రాక్షసుల ఇంటికి విచ్చేశాడు. ఆహ్వానించకుండానే వచ్చినమునిని చూసి సోదరులు ఆనందంతో స్వాగతం పలికారు. "మీ పాద స్పర్శతో మా గృహం పావనమయింది. ఈ రోజు మీకు విందు ఇచ్చే అవకాశం కల్పించండి" అని ప్రార్థించారు. అగస్త్యుడు అంగీకరించాడు. తాను నదికి వెళ్లి స్నానం చేసి రాగలనన్నాడు.

ఈలోగా యథాప్రకారం ఇల్వలుడు వాతాపి మేకగా మార్చి వంట చేశాడు. అగస్త్యుడు ఏటినుండి రాగానే ఆహారం పెట్టారు. ఆహారాన్ని తన శరీరంలో చేరగానే అగస్త్యుడు "నా ఉదరంలో వున్న వాతాపి జీర్ణం అగుగాక" అని పలికాడు. ఆయన చమత్కారంగా "ఓయి ఇల్వలుడా! నీవు నాకు పెట్టిన భోజనాన్ని పూర్తిగా జీర్ణం చేసుకున్నాను. ఇలాంటి భోజనంనేను ఎన్నడూ చేయలేదు. నీ ఔదార్యానికి కృతజ్ఞుడను" అన్నాడు. ఇల్వలుడు మామూలు ప్రకారం "వాతాపీ! బయటకు రా" అని కేకవేశాడు. అగస్త్యుడు నీవు ఎంత అరచినా వాతాపి బయటకు రాలేడు. అతడు నా పొట్టలో జీర్ణమై పోయాడు" అని తెలిపాడు.

ఇల్వలుడు కోపంతో అగస్త్యుని చంపటానికి లేచాడు. అగస్త్యుడు తన తపఃశక్తితో ఇల్వలుణ్ణి చంపివేశాడు.

ఈ విధంగా దుష్టరాక్షసులు హతులయినారు.

## 43. మూర్తీ భవించిన కరుణ వల్లలార్

చాలకాలం క్రిందట ఒక భూస్వామి రెండెండ్ల బండిపై వడలార్ అనే గ్రామానికి ప్రయాణం అయినాడు. అక్కడ వల్లలార్ అనే మహాత్ముడు ప్రవచనం చేస్తున్నాడు.

భూస్వామి బండితోలుతున్న వానితో త్వరగా బండితోలు అన్నాడు. ఎంతదూరం వెళ్లాక వారు ఒక నది సమీపానికి వచ్చారు. బండితోలేవాడు "ఎద్దులకు ఇక్కడి నదిలో నీళ్లు తాపుదాం అవి దప్పికతో వున్నవి" అన్నాడు.

భూస్వామి తర్వాత చూద్దాంలే! తొందరగాపోనీయి అని తొందర చేయసాగాడు.

మరికొంత దూరం పోయాక బండితోలువాడు "అయ్యా! ఎద్దులు బాగా అలసిపోయాయి. కాసేపు చెట్టు నీడన సేద తీర్చి పోదాం" అన్నాడు.

భూస్వామి "మనం సమయం వృథా చేయకూడదు. మనం స్వామిని దర్శించి రాత్రికే తిరిగి రావాలి పోనియ్యి" అన్నాడు. చాల శ్రమపడి ఎలాగైతే నేమి వారు వడలూరు చేరారు. వల్లలూరు స్వామి ప్రవచనం జరుగుతున్నది. భూస్వామి ఆయనకు మోకరిల్లి ఆయనకు ముందు భాగాన కూర్చున్నాడు.

బండివాడు వల్లలూరు ఇంటి వెనుక భాగాన గల దొడ్లోకి ఎడ్లను తోలుకొని పోయాడు. వల్లలూరు వాటిని గమనిస్తూ ఉన్నాడు.

స్వామి అకస్మాత్తుగా లేచి దొడ్లో, ఎడ్లు కట్టివేసిన తావుకు చేరాడు. అందరూ ఆశ్చర్యపోయారు. స్వామిజీ ప్రవచనం మధ్యలో లేవడం ఎప్పుడూ జరుగదు. అక్కడి జనం అంతా స్వామిని అనుసరించి దొడ్లోకి చేరారు.

స్వామిజీ ఎడ్లను తన చేతులతో నిమురుతూ "అయ్యో పాపం! మీరు నా కారణంగా ఎంత బాధపడ్డారు! మీకు దప్పిక అయినపుడు అలసటగా వున్నప్పుడు విశ్రాంతిలేక ఎంత హింసకుగురి అయినారు కదా! అంటూ కన్నీరు కార్చారు.

అక్కడే ఉన్న భూస్వామిలో చలనం వచ్చింది. "స్వామిజీ! నన్ను క్షమించండి! ఎద్దులు హింసకు గురి కావడానికి నేనే కారణం. మీరు ఒక పుష్పం నేల రాలితేనే ఎంతో బాధపడతారు. అలాంటిది జీవుల బాధలను మీరు ఎలా సహిస్తారు! నేనే బండివానితో ఎద్దులను వడివడిగా పోనియ్యమన్నాను" అని భూస్వామి అపరాధ వ్యక్తపరచాడు. స్వామిజీ తక్షణం ఎడ్లకు మేత వేయించాడు. తర్వాతనే ప్రవచనం కొనసాగించాడు. ఆయన తన ప్రసంగంలో "భగవంతుడు సమస్త జీవులలో ఉన్నాడు. ప్రాణికి ఏది చేసినా అది భగవంతునికి చేసినట్లే! కాబట్టి అన్ని ప్రాణుల ఎడల దయ కలిగి వుండండి. అదే శ్రీకృష్ణభగవానుడు గీతలో బోధించింది" అని ముగించారు.

## 44. విశ్వాసంలేని శునకం

ఒక అడవిలో అగ్రప్రభ అనే పేరు గలవాడు. చిన్న పూరిగుడిసెలో నివసిస్తూ ఉండేవాడు. క్రూరమృగాలుకూడా ఎవరికీ అపకారం చేయకుండా ఆయనతో సంచరించేవి. ఆశ్రమంలో ఒక పెంపుడు కుక్క ఉండేది.

ఒకసారి ఆ కుక్క అడవిలోపలికి చొచ్చుకొని పోయింది. ఒక చిరుత దాని వెంట పడ్డది. ఎలాగో తప్పించుకొని వచ్చిన కుక్క తన యజమానితో "ఒక చిరుత నన్ను చంపాలని వెంటపడింది. దానినుండి నన్ను కాపాడు" అని ప్రార్థించింది.

మునీశ్వరుడు తపఃశక్తితో ఆ కుక్కను చిరుతగా మార్చి ఇప్పుడు నీ కింక భయం ఉండదు అన్నాడు. మరొక చిరుతను చూచిన అడవికి చెందిన చిరుత అడవిలోకి వెళ్లిపోయింది.

చిరుతగా మారిన తర్వాత ఆశ్రమపు కుక్క అడవిలో స్వేచ్ఛగా విహరించసాగింది. ఒకనాడు దానిని ఒక పెద్దపులి వెంబడించింది. మరలా ఆ చిరుత మునీశ్వరుని సమీపించి పులిబారినుండి తనను రక్షించమని కోరింది. మునీశ్వరుడు దానిని పెద్దపులిగా మార్చాడు. అడవి తాలూకు పెద్దపులి మరొక పెద్దపులిని చూడగానే అడవిలోనికి వెళ్లిపోయింది.

ఒకరోజు పెద్దపులి వేషధారిగావున్న ఆశ్రమంకుక్క పెద్దఏనుగు తన మీదకు రావడం గమనించింది. భయంతో వణకిపోతూ తిరిగి ముని వద్దకు చేరింది. ఈసారి ముని దానిని ఏనుగుగా మార్చివేశాడు.

ఒకరోజు ఏనుగ రూపంలో వున్న ఆశ్రమ పెంపుడు కుక్కకు ఒక భయంకరమైన సింహం ఎదురయింది. ముని ఏనుగును సింహంగా మార్చి వేశాడు. అడవికి చెందిన సింహాలు మరొక సింహపు ఆకారాన్ని చూచి భయపడసాగాయి.

సింహంగా మారిన ఆశ్రమ పెంపుడు కుక్కలో గర్వం బలిసింది. దాని మనసులో ఒక దురాలోచన చొరబడింది. అది ఇలా ఆలోచించింది. "నేను అడవికి రాజును. మునికి తపఃశక్తి ఉంది. ఆయన ఆశ్రయం కోరిన ఏ జంతువునైనా నా మాదిరి సింహంగా మార్చవచ్చు. అప్పుడు నాకు విరోధి ఏర్పడతాడు. కాబట్టి, ఈ స్థితిని పటిష్ఠం చేసికోవాలంటే మునిని లేకుండా చేయడం అవసరం"

ముని తన తపఃశక్తితో సింహం వేషంలో వున్న ఆశ్రమకుక్క దుర్బుద్ధిని గ్రహించాడు. తక్షణం దానిని కుక్కగా మార్చివేసి "ఓ! విశ్వాసం లేని శునకమా! నీవు శునకంగా ఉండటానికే తగి ఉన్నావు" అన్నాడు.

## 45. గార్గిముఖి అనే రక్కసి

గార్గిముఖి అనే రక్కసి తిరుప్పురంకుంద్రం దగ్గిర ఒక గుహలో ఉంటూ వచ్చింది. శివుని పూజించే సందర్భంలో ఏ చిన్ని లోపం చేసిన వ్యక్తినయినా అది బందీగా తీసుకునేది.

అలా ఒక వెయ్యిమంది బందీలను పోగుచేసి ఒక్కసారి కాళికాదేవికి బలి ఇవ్వాలని గార్గిముఖి తలపోసింది. ఆ రక్కసి 999 మందిని బందీలను చేసి మరొక వ్యక్తికోసం వేచివుంది.

ఒకనాడు గొప్ప శివభక్తుడు సమీపంలోగల నదిలో స్నానం చేసివచ్చి చెట్టుక్రింద ఈశ్వర ధ్యానంలో నిమగ్నుడైనాడు.

అప్పుడే పెనుగాలి మొదలయింది. చెట్టుమీద నుండి ఆకులు రాలి క్రింద పడుతున్నాయి. ఒక ఆకు నదిగట్టున పడి ఒక పక్షిగా మారింది. మరొక ఆకునదిలో పడి చేపగా మారింది. చేపను నీటినుండి బయటకు లాగాలని పక్షి ప్రయత్నిస్తుంటే చేప దానిని ఎదిరిస్తున్నది.

నక్కీరన్ పక్షిచేపల పోరాటం గమనించి లేచి వెళ్లి పక్షిని వెంటాడి చేపను రక్షించాడు. రక్కసి ఇది గమనించి నక్కీరన్ దగ్గరకు వెళ్లి అతణ్ణి బందీగా తీసికొంది. శివుణ్ణి ధ్యానిస్తూ మధ్యలో లేచిపోవడమే అతడు చేసిన నేరం.

రక్కసి కాళికాదేవికి బలి ఇవ్వడానికి వెయ్యి ప్రాణాలు లభించినందుకు సంతోషపడింది. నక్కీరన్‌కు ఇతర బందీలు రక్కసి దుర్బుద్ధి తెలియజెప్పి తామంతా మృత్యు వాతపడబోతున్నట్లు భీతిచెందారు.

నక్కీరన్ వారందరినీ ప్రశాంతంగా ఉండమని కోరాడు. చావుకు భయపడవద్దనీ మురుగని గూర్చి భక్తితో పాటలు పాడటం ప్రారంభించాడు. మురుగడు ఒక పిడుగును గుహపై పడేటట్లు చేసి బందీలందరూ విడుదలయ్యేటట్లు చేశాడు. రక్కసి దీనినంతా గమనించి అవాక్కయింది. మురుగడు రక్కసిని ముక్కలు ముక్కలుగా చంపివేశాడు.

బందీలందరు మురుగని ప్రార్థిస్తూ తమ తమ ప్రదేశాలకు సంతోషంగా వెళ్లిపోయారు.

## 46. తెలివైన చిరకారి

ప్రసిద్ధులయిన మునివర్యులలో గౌతమ ఒకరు. ఆయన పదివేలమందికి శిష్యులను పోషిస్తూ ఉండేవాడు. కానీ చిన్న పొరపాటును కూడా

సహించలేకపోయేవాడు. ఒకసారి ఆతని భార్య అహల్య ఏదో ఒక చిన్న తప్పు చేసింది. ఆయన స్వభావం ప్రకారం కోపోద్రిక్తుడై తన కొడుకును పిలిచి కుటీరంలో ఉన్న తన తల్లిని చంపివేయి" అని ఆజ్ఞయిచ్చి వెళ్లిపోయాడు.

చిరకారి తెలివైనవాడు. బాగా అలోచించే ఏ పనైనా చేసేవాడు. అతడు ఆలోచించాడు. "స్త్రీని చంపడమే మహాపాపం. తల్లిని చంపడం కంటే గొప్పపాపం మరొకటిలేదు. కానీ, తండ్రి మాటను ఉల్లంఘించడం ఎట్లా? అది కూడా పాపమే! అతడు సందిగ్ధంలో పడ్డాడు. తండ్రి ఆజ్ఞను అమలు పెట్టడానికి కొంతకాలం వాయిదావేసే దిశగా ఆలోచించాడు.

ఈ మధ్యకాలంలో గౌతమముని కోపతీవ్రత తగ్గింది. తన ఆజ్ఞలన్నిటినీ సమీక్షించుకొన సాగాడు. ఒక చిన్న తప్పుకు గాను భార్యకు మరణ శిక్ష విధించడం న్యాయం కాదని తనకే తోచింది. తన కుమారుడు చిరకారి తొందరపడేవాడు కాదు తన తొందరపాటు ఆజ్ఞలను అమలు చేసి ఉండడు. విచారంతో కుటీరానికి వచ్చాడు గౌతమముని. తన కొడుకు చిరకారిని పిలిచాడు. ఆతడు వచ్చి "తండ్రీ! మీ ఆజ్ఞను – మంచిచెడు తేల్చుకోలేక – ఇంత వరకు అమలు చేయలేదు" అన్నాడు. గౌతమముని కొడుకును కౌగిలించుకొని "నా ఆజ్ఞపాలించ నందుకు సంతోషంగా ఉంది. నీవు నీ తల్లిని చంపి ఉన్నట్లయితే ఇప్పటికి నేను మరణించేవాణ్ణి నీ ఆలోచన వల్ల రెండు ప్రాణాలు రక్షించబడినాయి. అంటూ భార్య అహల్యతో "మనకు చిరకారి కుమారుడుగా కల్గి ఉండటం మనం ఎంతో అదృష్టవంతులం. అతడు తెలివికలవాడు. ఆలోచించకుండా ఏ పని తొందరగా చేయడు" అని ప్రశంసించాడు.

## 47. నీలన్ అనే రాజు

నీలన్ పేరుగల ఒక రాజు చోళ చక్రవర్తికి సామంతుడు. ఒకరోజు దేవాలయంలో నాట్యం చేస్తున్న బాలికను ప్రేమించాడు. ఆమె మిక్కిలి

అందగత్తె చక్కని ప్రతిభావంతురాలు. ఆమె మహాభక్తుడైన ఒక వైద్యుని పెంపుడు బిడ్డ. తన చేతిలో తామర పుష్పం పట్టుకొని ఒక కొలను గట్టున కేరింతలు కొడుతున్న బాలికను చూచిన వైద్యుడు ముచ్చటపడి ఆమెను తెచ్చి పెంచుకున్నాడు. ఆమెకు 'కుముదవల్లి' అని పేరు పెట్టుకున్నాడు. నీలన్‌రాజు ఒక వ్యక్తిని వైద్యుని వద్దకు పంపి యౌవనంలో వున్న కుముదవల్లిని తన కిచ్చి పెండ్లి చేయమనికోరాడు.

కుముదవల్లి రాజును వివాహమాడటానికి ఒక షరతు – ప్రతిరోజు 1008 మంది పేదలకు ఏడాది పాటు అన్నదానం చేయాలని – విధించింది. రాజు ఆ షరతుకు అంగీకరించాడు.

ఒక సంవత్సరంపాటు రాజు 1008 పేదలకు అన్నదానం చేశాడు.

కుముదవల్లి నీలన్ రాజుల వివాహం వైభవంగా జరిగింది. రాజు "తిరునావైయానమ్"లోగల శ్రీమహావిష్ణువును పూజిస్తూ వచ్చాడు. 1008 మంది అన్నదానం కూడా కొనసాగించాడు. ఆయన ఎల్లవేళలా మెడలో తులసిమాల ముఖాన త్రిపుండ్రాలు ధరించాడు.

కాలక్రమంలో కోశాగారం ఖాళీ అయింది. సామంతరాజుగా చక్రవర్తికి చెల్లించాల్సిన సొమ్ము చెల్లించ లేకపోయాడు.

రాజుకు కప్పం చెల్లించనందుకు బందీచేసి 'తిరునావైయానమ్' మహావిష్ణు ఆలయంలో ఉంచారు. ఆయనకు అన్న పానీయాలు ఏమీ ఇవ్వలేదు. ఆయన భగవంతుణ్ణి ప్రార్థిస్తూ కాలం గడిపాడు.

ఒకనాడు రాత్రి రాజుకు కలవచ్చింది. ఆకలితో ఒక కంఠం ఇలా విన్పించింది.

"చక్రవర్తికి రావలసిన బాకీలన్నీ కాంచీపురంలో చెల్లించబడుతాయని చెప్పు'' చక్రవర్తికి కలవిషయం తెలుపబడింది. చక్రవర్తి రాజును,

సైన్యాధికారిని తీసికొని కాంచీపురం వెళ్లాడు. అక్కడ వేగావతి నది ఒడ్డున బంగారు నాణేల బస్తాలు కన్పించాయి. ఆ డబ్బు చక్రవర్తికి చెల్లించాల్సిన కప్పం కాకుండా ప్రతి నిత్యం 1008 మంది పేదలకు చేసే అన్న సంతర్పణకు కావలసినంత ధనం ఉంది.

చోళచక్రవర్తి నీలన్ రాజుకుగల అకుంఠిత భక్తి గుర్తించాడు. ఆతనికి బాధ కలిగించినందుకు క్షమాపణకోరాడు. ఇక నుండి తనకు కప్పం చెల్లించనవసరం లేదనీ ఆ డబ్బును మరి కొందరికి అన్నదానం చేసేందుకు వినియోగించుకొమ్మని చెప్పాడు.

ఇబ్బందులలోవున్న భక్తులను భగవంతుడు రక్షిస్తాడు.

## 48. మహా త్యాగం

కురుక్షేత్రం యుద్ధం విజయవంతంగా ముగియగానే ధర్మరాజు అశ్వమేధయాగం చేశాడు. భారతదేశంలోని రాజులందరినీ ఆహ్వానించారు. వారందరూ వైభవంగా జరుపబడిన యాగాన్ని గూర్చి ప్రశంసించారు. వేలాది బ్రాహ్మణులకు పేదలకు అనాథలకు యుధిష్ఠిరుడు పెద్ద మొత్తాలలో ధనం, బహుమతులు అందజేశాడు. అందరికీ సుష్ఠుగా విందుభోజనాలు సమకూర్చబడినాయి. యుధిష్ఠిరుని మించిన దాతలేడని వారందరూ చెప్పారు.

యాగం జరుగుతుండగా ఎక్కడినుండి వచ్చిందో ఒక ముంగిస అక్కడికి వచ్చిన వారందరి మధ్య నిలిచి వెటకారంగా నవ్వడం ప్రారంభించింది. వారందరూ దానిని యాగం చెడగొట్టడానికి వచ్చినదేమోనని అనుమానించారు.

సభాసదులను ఉద్దేశిస్తూ అది ఇలా అన్నది "ఓ! మహారాజులారా! బ్రహ్మణోత్తములారా! వినండి! మీరందరు యుధిష్ఠిరుడు మహావైభవంగా యాగంచేస్తూ భూరివిరాళాలు దానాలు అనితర సాధ్యంగా ఇస్తున్నాడని మీరు గర్వంతో భావిస్తున్నారా?

ఈ రాజు ఇచ్చిన దానాలు లోగడ ఒక బీద బ్రాహ్మణుడు ఇచ్చిన దానాలతో సాటిరావు. అవి నిశ్చయంగా గొప్పవే! ఇప్పుడు ఇస్తున్న దానాలు చెప్పుకోదగినవి కావు. అలాంటప్పుడు మీరంతా ఉత్సాహంతో బిగ్గరగపొగడటం ఎందుకు?

ఇది విన్న బ్రాహ్మణులంతా స్తబ్ధులై ముంగిసతో "ఎవరునీవు? ఎక్కడ నుండి వచ్చావు? యుధిష్ఠిరుని దానాలనే విమర్శిస్తావా? అయన రూపు దాల్చిన ధర్మము. యాగం శాస్త్రబద్ధంగా నిర్వహింపబడి అందరూ తప్పుపడితే నీవు విమర్శించటం సరికాదు" అని వ్యాఖ్యానించారు.

ముంగిస బదులిస్తూ "ఓ పండితోత్తములయిన బ్రాహ్మణులారా! నేను చెప్పిన దానిలో చిన్న మెత్తు అసత్యంలేదు. ధర్మరాజుపట్ల నాకు అసూయలేదు. నేను దృఢంగా చెబుతున్నాను. పేద బ్రాహ్మణుడు ఇచ్చిన దానాలు ఇక్కడి ఇచ్చిన వాటికంటే చాలరెట్లు గొప్పవి. ఆయన చేసిన ధర్మాలకారణంగా ఆయన భార్య, కొడుకు, కోడలు స్వర్గలోకంలో స్థానం పొందారు. నేను అందుకు సాక్షిని. ఆ సంఘటన నేను వివరిస్తాను. దయచేసి వినండి. కురుక్షేత్ర యుద్ధానికి ముందు ఒక పేద బ్రాహ్మణుడు భిక్షాటనతో జీవించేవాడు. నేలమీదపడిన గింజలను కూడా ఆహారంకోసం ఏరుకొనే వాడు. అతని కుటుంబం అందరూ సమంగా ఆహారాన్ని పంచుకునేవారు. ఏ రోజుకు ఎంత అవసరమో అంత మాత్రమే వారు సేకరించుకునేవారు.

ఒకనాడు వారికి తిండి గింజ ఒక్కటి కూడా దొరకలేదు. ఆ దినం వారికి ఉపవాసమే! వర్షాలులేక వ్యవసాయ పనులులేవు. ఒక గింజ కూడా దొరకటంలేదు. కొన్నాళ్ళు వారి మంచినీరు త్రాగి గడిపేవారు.

ఒకరోజు అదృష్టం కొద్దీ ఒక తవ్వెడు మైదా దొరికింది. దానిని పిండిగా చేసికున్నారు. వారు మధ్యాహ్నానికి సాయంకాలానికి భోజనానికి భాగాలు తీసికొని తినబోతున్నారు. అప్పుడే ఒక బ్రాహ్మణుడు ఆకలితో వచ్చాడు.

ఆయనను లోనికి ఆహ్వానించి సాయంత్రం భోజనానికి ఉండమన్నారు. ఆయన అతిధితో చెప్పాడు "నేనొక పేద బ్రాహ్మణ్ణి. యాచనతో జీవిస్తున్నాను. మా వద్ద వున్న దానిలో పెడతాం తృప్తి పడండి" తొలుత గృహస్తు తన వంతు పిండిని అతిథికి ఇవ్వజూపారు. ఇది అతని ఆకలి తీర్చదు. అతడు ఇంకా కావలెనన్నాడు. బ్రాహ్మణుడు తన భార్య వైపు చూచాడు. ఆమె తన భర్త కోరికను అర్థం చేసికొని తన భాగంపిండి అతిథికి అందజేసింది. అతిథి భార్య ఇచ్చిన భాగం పిండి కూడా ఆరగించాడు. ఇంకా కావలెనన్నట్లు చూచారు.

తండ్రి తన కుమారునితో చర్చ చేశారు. అతడు కూడా తనవంతును అతిథికి సమర్పించాడు. అప్పటికీ అతనికి ఆకలితీరలేదు. బ్రాహ్మణునికి ఏమిచేయాలో పాలుపోలేదు. కోడలూ తన వంతు పిండిని ఇవ్వజూపింది. అతిథి వలదని చెప్పినా కోడలు తన వంతు పిండిని అర్పించింది. నలుగురి భాగం తిన్న అతిథి తృప్తిపడినవారితో ఇలా అన్నారు" ఈ రోజు మీరు చేసిన దానం ప్రపంచంలో సాటిలేనిది చూడండి. దేవతలు మీపై పుష్ప వర్షం కురిపిస్తున్నారు. దేవతలు గంధర్వులు ఆశీర్వదిస్తున్నారు. మీ దానం మూలంగా మీ పూర్వులు స్వర్గంలో స్థానం సంపాదించారు. ఈ రోజు మీరు చేసిన దానం, రాజసూయ యాగం అశ్వమేధయాగం చేసిన వారికంటే గొప్పది. మీకు మేలు కలుగుగాక" అని ఆశీర్వదించాడు. అతిథి అక్కడ నుండి అంతర్ధానమయినాడు.

ముంగిస తన మాటలను కొనసాగించింది. ''ఈ కుటుంబం స్వర్గలోకంలో చేరడంలో నేనొక సాక్షిని. పిండిని వుంచిన స్థానంలో దగ్గరలో వున్నాను. ఆ పిండిని వాసన చూసేసరికి నా తల బంగారంలాగా ప్రకాశించింది. నేల మీదపడిన పిండి తగలగానే ఆ భాగం బంగారమయింది.

నా శరీరాన్ని అంతా బంగారం చేసికోవాలని నేను అనేక యాగశాలలలకు వెళ్లి భారీగా దానాలు జరగడం చూచాను. నేను ఇప్పుడు ఇక్కడికి వచ్చాను. యుధిష్ఠిరుడు దానాలను అపూర్వంగా చేస్తున్నాడని

విన్నాను. మీరంతా చూస్తూ ఉన్నారు గదా! నా శరీరారనికి బంగారు రంగు రాలేదు. చాల నిరుత్సాహం కల్గింది ముంగిస చివరిగా బ్రాహ్మణులతో "మీరంతా బీద బ్రాహ్మణ్ణి గురించి విన్నారుగదా! బ్రాహ్మణుడు తన కుటుంబానికి అత్యవసరమయిన తిండిని దానమిచ్చాడు యుధిష్ఠిరుడు అదనంగావున్న సంపదను - దానివలన అతడే కష్టం పాలుకాలేదు - మాత్రమే దానం చేస్తున్నాడు.

ఓ బ్రాహ్మణులారా! ఇప్పుడు చెప్పండి. ఎవరు గొప్పో! పేదబాపడా! యధిష్ఠిరుడా" అంటూ ముంగిస అక్కడ నుండి మాయమయింది.

## 49. శర్మిష్ఠ

వృషపర్వుడను రాక్షస రాజుకు శుక్రాచార్యుడు గురువు. వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ. శుక్రాచార్యుని ముద్దుల పట్టి దేవయాని. వారిరువురు ఆత్మీయ మిత్రులు.

ఒకరోజు దేవయాని, శర్మిష్ఠ అడవిలోకి విహారయాత్రగా వెళ్లారు. అక్కడ ఒక కోనేరు కనిపించింది. స్నానాలు చేయాలనుకున్నారు. తమ దుస్తులను కోనేరు గట్టుమీద పెట్టి స్నానానికి కోనేరులోకి దిగారు. అక్కడ వీచిన పెనుగాలికి వారి వస్త్రాలు కలిసిపోయాయి. రాకుమారి ముందుగా, ఈతముగించుకొని బయటకు వచ్చి పొరపాటున దేవయాని దుస్తులు ధరించింది. దేవయాని తర్వాత వచ్చి తన దుస్తులు శర్మిష్ఠ ధరించడం గమనించింది. ఆమె శర్మిష్ఠను తూలనాడింది. శర్మిష్ఠ దేవయానిని దూషించింది. "మా తండ్రి ఈ దేశానికి ప్రభువు అని తెలిసికో" అని శర్మిష్ఠ గర్వంగా చెప్పింది. "అయితే ఏమిటట? మా తండ్రి రాక్షసులందరికీ ఆచార్యుడు! గురువు! మీ తండ్రి కూడా నా తండ్రికి మోకరించే వాళ్లలో ఒకడే!" అని దేవయాని బదులిచ్చింది.

"మా తండ్రి ఇచ్చే భృతి మీద మీరు జీవిస్తున్నార"ని దేవయానిని శర్మిష్ఠ హేళన చేసింది.

ఆ తగాదా తీవ్రరూపం దాల్చి శర్మిష్ఠ చెలికత్తెలయిన రాక్షసకన్యలు దేవయానిని నీళ్ళులేని బావిలోనికి తోసి తమదారిని తాముపోయారు. ఆమె బావిలో నుండి బయటకు రాలేక దీనంగా ఏడుస్తూ ఉండి పోయింది. పురువంశానికి చెందిన యయాతి చక్రవర్తి వేట కారణంగా అటువైపు వచ్చాడు. దేవయాని రోదించడం విన్నాడు. తన చేయి అందించి ఆమె చేతిని అందుకొని దేవయానిని బావినుండి బయటకు తీశాడు. యయాతి. దేవయానులు పరస్పరం పరిచయం చేసుకున్నారు.

దేవయాని వృషపర్వుని రాజధానిలో ప్రవేశించదలచలేదు.

దేవయాని యయాతిని వలచింది. ఆమె "ఓ చక్రవర్తీ! మీరు నాకు కుడి చేతిని ఇంతకు ముందే చేపట్టారు. ధర్మశాస్త్రప్రకారం అది వివాహంతో సమానమే! మీరే నాకు తగినభర్త అని నా భావన" అని తెలిసింది. కానీ యయాతి సందేహం వెలిబుచ్చుతూ "నేను క్షత్రియుణ్ణి, నీవేమో బ్రాహ్మణ కన్యవు. అందులోను రాక్షసుల గురు దేవులయిన శుక్రాచార్యుని కుమార్తెవు. మన వివాహానికి మీ తండ్రి అంగీకరించాల్సి ఉంటుందని" బదులిచ్చాడు.

శుక్రాచార్యులు సంఘటనలన్నీ తెలుసుకున్నాడు. తన కుమార్తె నగర ప్రవేశానికి ఇష్టపడడం లేదని భావించి తానే ఆమె దగ్గరకు వెళ్లాడు. బావిచెంత గల చెట్టుక్రింద ఆమెను ఓదార్చి నగరానికి రావల్సిందిగా ఆమెను బ్రతిమాలాడు. దేవయాని తండ్రి నీతి బోధవినే పరిస్థితిలో లేదు. శర్మిష్ఠ గర్వాన్ని గూర్చి వివరిస్తూ "రాజు గారి కీర్తిని ప్రశంసించడమేనా మీపని? రాజుగారి దయా దాక్షిణ్యాలపై ఆధారపడి జీవించే పరాన్న భుక్కూ అని విమర్శించింది.

దేవయాని బిగ్గరగా రోదించడం మొదలు పెట్టింది. తన ప్రతిష్ఠలు మంట కలిశాయని భావించిన శుక్రాచార్యుడు. శర్మిష్ఠ పొగరుకు తగిన గుణపాఠం చెప్పాలనుకున్నాడు.

దేవయాని సంతసించింది. శుక్రాచార్యుడు వృషపర్వుని వద్దకు వెంటనే వెళ్లి "ఓ! రాజా! నేను ఇంక ఏమాత్రం నీ సేవలో ఉండలేను. నా ప్రియ శిష్యుడైన కచుడు ఏ తప్పు చేయకపోయినా మీ సేవకులు పలుమార్లు అతనిని వధించినా ఊరకున్నాను. ఇప్పుడు నీ కుమార్తె శర్మిష్ఠ మా అమ్మాయి దేవయానిని అగౌరవపరచి గాయ పరచింది. ఆమె రాజ్యంలో ఎంతమాత్రం ఉండదలచుకోలేదు. కాబట్టి, నేను ఇక్కడ నుండి వెళ్లిపోతున్నాను" అని నిర్మొహమాటంగా చెప్పాడు.

వృషపర్వుడు అవాక్కయిపోయాడు. శుక్రాచార్యులు లేకుండా అతడు వుండలేడు. వృషపర్వుడు పరివారంతో దేవయాని వద్దకు క్షమాపణ వేడుకున్నాడు. దేవయాని క్షమాపణకు ఒక షరతు విధించింది.

గర్విష్ఠియైన శర్మిష్ఠ తనకు బానిసగా జీవితాంతం – తాను పెండ్లి చేసికొన్న పిమ్మట కూడా – తన ఇంట్లో ఉండాలన్నదే ఆ షరతు.

వృషపర్వుడు తన కుమార్తె శర్మిష్ఠతో దేవయాని విధించిన షరతు గూర్చి తెలిపాడు. ఆమె ఎంతో ఔదార్యంతో తన స్వేచ్ఛను జీవితాంతం త్యాగం చేయడానికి అంగీకరిస్తూ ఇలా అన్నది "నా తొందరపాటు చర్యతో మా తండ్రి మహామహుడయిన గురువును పోగొట్టుకోరాదు" ఆమె త్యాగం మహాఘనమైన చర్యగా కీర్తించబడింది.

## 50. శిబిచక్రవర్తి

పూర్వకాలంలో 'శిబి' అని పేరుగల ఒక గొప్ప రాజు ఉండేవాడు. ఆయన మిక్కిలి దయగలవాడు. దానధర్మాలు విరివిగా చేస్తూ మిక్కిలి ఖ్యాతి గడించాడు. ఆయన కీర్తి ప్రపంచమంతటా వ్యాపించి దేవలోకం చేరింది.

దేవతల రాజైన ఇంద్రుడు 'శిబి ప్రచారం చేయబడినంత గొప్పవాడా కాదా అని పరీక్షించదలిచాడు.

శిబి ఒకనాటి సాయంత్రం తన ఉద్యానవనంలో పేదలకు దానధర్మాలు చేస్తూ ఉన్నాడు. ఒక చిన్న పావురం భయంతో రివ్వున వచ్చి శిబి ముంజేతిపై వాలింది. కన్నీరు కారుస్తున్నది. శిబి వెంటనే దానిని తన చేతిలోకి తీసికొని వీపునిమిరి "భయపడకు నీకు ఏ ఆపదా రాకుండా రక్షిస్తాను" అని ధైర్యం చెప్పాడు.

అలా చెప్తూ ఉండగనే ఒక గద్ద కోపంతో వచ్చి రాజు చేతులనుండి పావురాన్ని లాక్కొని వెళ్లాలని ప్రయత్నించింది. గద్ద, రాజు వైపు కోపంగా చూస్తూ మానవ భాషలో "ఈ పావురం చిక్కింది. ఉదయం నుంచి నేనూ దీనిని వెంటాడుతున్నాను. నా ఆహారాన్ని నాకు కాకుండా చేస్తావా రాజా" అని నిష్ఠూరమాడింది.

శిబి ఇలా అన్నాడు "నీ వెవరో నేను ఎరుగను. నీవు మానవునిలాగా ఎలా మాట్లాడ గలుగుతున్నావు. భయకంపిత అయిన ఈ పావురం నా శరణు వేడింది. దానిని ఎలాంటి అపాయం నుండైనా రక్షించాల్సిన భారంనాది. దానిని నా చేతులనుండి లాక్కొనడానికి నేను సమ్మతించను"

గద్ద తిరిగి ఇలా చెప్పింది "మీరు ఎంతో ప్రఖ్యాతి గల రాజులు ఆపదలో ఉన్నవారికి రక్షించడం మీ ధర్మం కాని నా సంగతి ఏమిటి? నేను మాత్రం మీదయను కోరదగనా? నేను పక్షిని. చిన్న పక్షులను భక్షించి జీవించే దానిని. నా ఆహారాన్ని నాకు కాకుండా చేస్తూ నన్ను మరణానికి గురి చేస్తున్నావు కదా? ఇదే నా నీ ధర్మం" అని శిబిని నిలదీసింది.

శిబి తొట్రుపడలేదు. గద్ద మానవ భాషతో మాట్లాడడమేకాదు. వాదిస్తున్నది. కూడా! యధార్థంగా గద్దను, పావురాన్ని రెండింటిని నేను రక్షించాల్సిన వాడినే! రాజు గద్దతో "నీవు చెప్పింది నిజమే! నీ ఆహారానికి నేను అడ్డుపడను. అదే సమయంలో ఈ చిన్ని పక్షిని వదలలేను. కొంత మాంసం పరిహారంగా ఇస్తే ఒప్పు కొంటావా?" అని ప్రశ్నించాడు.

గద్ద “మంచిది. నా ఆకలి తీరడమే నాకు కావాల్సింది. కాని, నీవు పావురానికి సమానమయిన మాంసం ఇవ్వాలి. అని నవ్వుతూ ఇంతకు మాంసం ఎక్కడ తెస్తావు? ఈ పావురాన్ని రక్షించటానికి మరొక ప్రాణిని హింసిస్తావా? అని అడిగింది.

శిబి వెంటనే బదులు చెప్పాడు.

“లేదు! లేదు! నేను మరొక ప్రాణికి అపకారం తలపెట్టను. నేను పావురానికి బదులుగా నా శరీరంలోని మాంసం ఇస్తానని తెలిసికో” ఈ మాటలు పలికి ఒక త్రాసును తేవలసిందిగా సేవకులను శిబి ఆదేశించాడు.

సేవకులు త్రాసును తెచ్చి రాజు ముందు వ్రేలాడదీశారు. శిబి ఒక వైపు పావురాన్ని ఉంచాడు. కత్తితో తన శరీరభాగాన్ని కోసిన మాంసం మరొక వైపు ఉంచాడు.

చిత్రం! చిన్నపిట్టగా ఉన్న పావురం బరువు అప్పటిప్పటికీ పెరుగుతున్నట్లు అనిపించింది. ఎంత మాంసం ఉంచినా సరిసమం కావటంలేదు. శిబి తన శరీరంనుండి ఒక్కొక్క ముక్కకోస్తూనే ఉన్నాడు. చివరకు తన శరీరంలో మాంసం ముక్క మిగులలేదు. శిబి తన చేతిలోని కత్తి విసిరి వేసి తానే త్రాసులో కూర్చున్నాడు.

ఆశ్చర్యం! ఇప్పటికి త్రాసుసరితూగింది. గద్ద కోరిన మాంసం ఇవ్వగలిగినందుకు శిబి ఆనందించాడు. శిబి దానితో “ఓ గద్దా! నా బరువు పావురంతో సమంగాతూగింది. నన్ను తిని పావురాన్ని వదలి వెళ్ళు” అని చెప్పాడు.

ఇది శిబి నోటినుండి వెలువడగానే దేవతల హర్షధ్వానాలు ఆకాశంలో చెలరేగాయి. వారంతా ఈ పోటీని చూడాలని కుతూహలంగా విచ్చేశారు. దేవలోకంలో దుందుభులు మారుమ్రోగాయి. శిబిపై పుష్పవర్షం కురిసింది. వారు ధరించిన గద్ద పావురాల వేషాలు వదలి స్వ స్వరూపాలలో కన్పించారు.

శిబి విస్తుపోతూ వారిని చూచాడు. ఇంద్రుడు "ఓ చక్రవర్తీ! మేము ఇంద్రాగ్ని దేవతలం, ఆకాశంనుండి నిన్ను పరీక్షించడానికి వచ్చాం. నీ కీర్తి మించిందని నీవు నిరూపించుకొన్నావు. నీకు దీర్ఘాయువు, అశేషసంపద లభించుగాక!

శిబిని ఇంద్రుడు తాకగానే ఆయన శరీరంలోని గాయాలన్నీ మాయమయ్యాయి. శరీరం తిరిగి యథా స్థితికి వచ్చింది.

దేవతలకు మోకరిల్లగా శిబి చక్రవర్తిని దేవతలు ఆశీర్వదించి తమ తమ నివాసాలకు వెళ్లిపోయారు.

* * *